

# దీపావళి ప్రత్యేక సంచిక

మెకానికల్ డాటా

| | |
|---|---|
| పేజ్ ఏరియా | 28 × 21 సెం. మీ. |
| ప్రింట్ ఏరియా | 21 × 17.5 సెం. మీ. |
| ఆఫ్ పేజ్ | 10.5 × 17.5 సెం. మీ. |
| కాలమ్ సంఖ్య | 3 |
| కాలమ్ సైజు | 21 × 5.5 సెం. మీ. |

అడ్వర్టయిజ్‌మెంటు రేట్లు

| | |
|---|---|
| ఓపెనింగ్ పేజీ | రూ. 250-00 |
| లోపలి పేజీ | రూ. 200-00 |
| లోపలి సగం పేజీ | రూ. 110-00 |
| నాల్గవ కవరు పేజీ (మూడు రంగులు) | రూ. 600-00 |

బ్లాకులు, స్టీరియోలు అంగీకరింపబడును

వివరాలకు :
అడ్వర్టయిజ్‌మెంటు మేనేజర్
జ్యోతి
7-A శివాజీ స్ట్రీట్. టి. నగర్.
మద్రాసు-17.



# దీపావళి ప్రత్యేక సంచిక

దీపావళికి ముందుగానే అన్ని హంగులతో, అనేకానేక ఆకర్షణలతో అభిమాన రచయిత (తృ)ల రచనలతో మామూలు సంచికకు రెట్టింపు సైజులో వెలువడుతుంది.

●

ఆనవాయితీగా 'జ్యోతి'ని ఆదరించి అభిమానిస్తున్న పాఠకులకు, ప్రకటనదారులకు మా కృతజ్ఞతలు.

అదే విధంగా ఈ ప్రత్యేక సంచికను కూడా ఆదరిస్తారని ఆశిస్తున్నాం.

●

'జ్యోతి'

7-A శివాజీ స్ట్రీట్, టి. నగర్

మద్రాసు-17.



సచిత్ర మాస పత్రిక

7 A. శివాజీ స్ట్రీట్

టి. నగర్, మద్రాసు-17.

ఫోన్ : 442001

విడి ప్రతి వెల

1 రూపాయి

ఏడాది చందా

పన్నెండు రూపాయలు

సంపుటి 9

ఆగస్టు 1971

సంచిక 8

సంస్థాపకులు :

కీ. శే. వి. వి. రాఘవయ్య

మేనేజింగ్ ఎడిటర్.

శ్రీమతి వి. లీలావతి రాఘవయ్య

Edited add Published by Smt V. Leelavaty and Printed by Sri B. V. Narasimha Rao at Sri Krishna Chitra Printers, 7, Nageswara Rao Road, Madras-17



ముఖచిత్రం.

సుభాషిణీ ఆర్ట్ పిక్చర్స్

'అదృష్ట జాతకుడు'లో

ఎన్. టి. ఆర్. - వాణిశ్రీ

# తొలిమాట

మీరు అనేకసార్లు దైవోపహతులు, ప్రేమోపహతులు ఇల్లాంటి హతులు చాలా చదివి ఉంటారు. కానీ ఆ కోవలోకే చెందే బంధోపహతులనే తెగను చదివి ఉండరు.

—చూ. పే. 33

మనుషులంతా ఒకే మూసలో పోసినట్లుగా ఎప్పుడూ ఉండరు. అల్లాగే ఒకే మనస్తత్వాలు కూడ కలిగి ఉండరు. భిన్న-భిన్న మనస్తత్వాలతో పోయే పోకడలు ఎలా ఉండును?

—చూ. పే. 80

ఎన్ని డిగ్రీలు సంపాదించినా స్వార్థపరుల ప్రభావాలకు లొంగి పోవాల్సిందేనని మనం మరో మారు చదువుకోవచ్చు.

—చూ. పే. 67

ఈ సంచిక నుండి రాజకీయాలు అవిఘ్నంగా కొనసాగించ బోతున్నాము. మీరంతా సదభిప్రాయంతో గ్రహించగలరని తలుస్తాను.




జూలై పత్రికలో శ్రీ ఎ. వి. శ్రీరామ మూర్తిగారు వ్రాసిన "లంకాదహనం", "సంబరాలకు సంబరపడే అబలు" చదివి, సంబరాలలో సంబరాలను అర్థం చేసుకోమని కోరుతూ ముగిస్తున్నాను.

—హయగ్రీవ్, వైజాగ్.

ఈ మధ్య "జ్యోతి" సచిత్ర మాస పత్రికలోని మాదిరెడ్డి సులోచనగారి 'శిక్ష' సీరియల్ చాలా బాగున్నది. ఆ సీరియల్ లోని 'గురుకులములో అమ్మాజీ, బాబాజీ పాత్రలు వారు పెట్టు కష్టములు అవి చదువుతుంటే చిన్నప్పుడు చదువుకొన్న 'Do THE BOYS HALL' అనే Charles Dickens కథ జ్ఞాపక మొస్తోంది. ముఖచిత్రాల మీది సినిమా తారల బొమ్మలు బాగానే వుంటున్నాయి కాని, ఎప్పుడూ అవే గాకుండా అప్పుడప్పుడు మంచి Sceneries గూడా వేస్తే బాగుంటుంది.

—దర్భా ఉదయలక్ష్మి, తిరుపతి

ఎడిటర్,

ఈనాడు ఎన్నో ఘోరాలు జరుగుతూనే వున్నాయి. దేముడి పేరిట మరీను. ఈ నగ్న సత్యాన్ని నిరూపించిన కథ 'లంకాదహనం'. కథ పూర్తివరకూ బిగువుగా, ఆతృతగా నడిచింది. ఇటువంటి కథలు, సన్నివేశాలు జరిగినవా లేదా అని అనుమాన పడనక్కరలేదు. ఇంత చక్కని యితివృత్తం గల కథనందించిన రచయిత శ్రీ ఎ. వి. సీతారామమూర్తి గారికీ, ప్రచురించిన మీకూ మా ధన్యవాదాలు. రచయిత రచనలను మరికొన్ని అందించగలరని ఆశిస్తూ—

—కె. కమలారమణమూర్తి, గాజువాక.

డియర్ సార్,

మీ "జ్యోతి"లో మాదిరెడ్డి సులోచన గారి కథ 'శిక్ష'లో, 45 పేజీలో ఢిల్లీలోని తెలుగు వాళ్ళ మీద, వాళ్ళ భాష మీద, ఢిల్లీ తెలుగు వాళ్ళు తెలుగు పుస్తకాలు చదువుట మరచిపోయారు అని ఏమేమో వ్రాశారు. అది చదివి నాకు చాలా బాధ కలిగినది. వారు ఎప్పుడో పాతకాలనాటి సంగతి చెప్తున్నట్లున్నారు. కరోల్ బాగ్ లో తెలుగు పుస్తకాలు దొరుకుతాయని, కరోల్ బాగ్ లో తెలుగువాళ్లు తెలుగు వాళ్ళతో తెలుగులోనే మాట్లాడుకుంటారని కూడా చెప్తుంటారు. కాని వారు రాసినది నిజానికి చాలా దూరం. రచయిత్రి గారు యీ విమర్శను సహృదయముతో స్వీకరించగలరు.

—రామారావు, న్యూఢిల్లీ.

---

## గమనిక

జూలై సంచికలో 102వ పేజీలో ప్రచురించబడిన వధూవరులు చి॥ అచ్యుత రామయ్య, చి॥ సౌ॥ సంధ్యారాణులుగా గుర్తించగలరు.

---




మాస్తున్నాం. మనది వ్యాపార
వ్యాపారానికి పనికిరాని పని
కి డబ్బు రాదు. డబ్బు రావా
లి. వ్యాపారానికి పనికొచ్చేలా
ంటేకావి. కావ్యాలు వ్రాస్తే

ౖనాథవారు మహాపండితులు.
ములు. పద్మభూషణ బిరు
వారు 80 గ్రంథాలు వ్రాశారు.
కాలు. పద్యకావ్యాలు. విమ
వారు వ్రాయని ప్రక్రియ

సమానంగా ఉపాధ్యాయుడిని.
ంచకుడికి జ్ఞాన ప్రదానం
మే వ్రాస్తున్నాను' అన్నా
వారు.

విశ్వనాథవారికి రచనలో లక్ష్యశుద్ధి వుంది. ఆయన తాను నమ్మిన ధర్మాన్ని బోధించడమే ధ్యేయంగా పెట్టుకున్నారు. అందుకనే అన్ని గ్రంథాలు వ్రాయగలిగారు. మన రచయితలలో చాల మందికి లక్ష్యశుద్ధి లేకపోవడంవల్ల, తాము నమ్మేదొకటీ వ్రాసేదొకటీ కావడంవల ఉత్తమ రచనలు చేయలేక పోతున్నారన్నది వాస్తవం. ఏదో ఒక స్పష్టమైన లక్ష్యం లేనిదీ రచయిత రచన ఎలా చేయగలడు?

కాబట్టి మనం విశ్వనాథవారిని అభినందించాలి.

—కృష్ణవేణి

# సత్యం, శివం, సుందరం

నిన్న కంటె రేపెంతో
విలువైనది, విలువైనది,
నిన్న కంటె రేపెంతో
* బలువైనది, బలువైనది,

రేపు కోసం నిన్నను
మరచిపో-మరచిపో,
రేపు కోసం నేటిని
నిలుపుకో-నిలుపుకో....

అంతులేని కాలమందు
మన జీవితం ఒక్క క్షణం,
కక్షలతో కలతలతో
'వృథా చేయకు ఓ నేస్తం,
పగల సెగల కోర్వలేదు
సుతిమెత్తటి దీ హృదయం,
పాత పగల మరచిపో,
ప్రేమించుట నేర్చుకో....

* దీర్ఘమైనది

[సుప్రసిద్ధ ఆంగ్ల వ్యంగ్య నటుడు, దర్శక నిర్మాత, రచయిత, సంగీత స్వరకర్త శ్రీ చార్లీచాప్లిన్‌కో అత్యంత ప్రియమైన ఆంగ్ల గేయాన్ని చదివిన తర్వాత]

—శ్రీరామచంద్.

మాదిరెడ్డి సులోచన



“నీ పడక గదిలోకి నేను చలపతి తాత తప్ప ఇంత స్వతంత్రంగా యెవరు వస్తారు శశీ? తాత మూడురోజుల వరకు రాడని విన్నాను,'' అన్నాడు వచ్చి కూర్చుని.

“శంకర్! నా మీద నీ కెందు కింత కసి? నన్నెలాగైనా బ్రతుకనియ్యవా? నీ మూలంగా నేను ఈ ముసలివాడి ఇల్లాలు నయ్యాను. పరువుగా బ్రతుకుదా మంటే నీ దేం గోల? యింట్లో అతని కొడు కున్నాడు. ఏ మనుకుంటాడు?” అన్నది కోపంగా.

“నన్ను నేను ఏమన్నానని? ఒక పని చెయ్యి శశీ."

“నీ సలహాలు అనవసరము. దయ చేసి నన్నువదలిపెట్టు. మొన్న సినిమాలో మా సుశీల చూసిందట. నన్ను యెంత నీచంగా ఊహించిందో?"

సీరియల్

"రెండు నెలలవనండి మనము సినిమాకే పోలేదు. మొన్నంటా వేమిటి?"

"వెళ్ళిన రోజులే. వెళ్ళిపో శంకర్, వెళ్ళిపో, నా కోసం కాదు. పాపను చూడు, దాని బ్రతుకు బజారున పెట్టకు. దళపతి కూతురుగా పెరిగితేనే మంచిది."

"కాదని యెవ రన్నారు? నీ దారి కెప్పుడూ అడ్డురాను. ఒక వందరూపాయలుంటే సర్దు."

"వంద యిచ్చి నెలకాలేదు. యింకా నా దగ్గర యెక్కడున్నాయి?" ఏడుపు రాబోయింది. బింకంగా ఆపుకుంది

"సరీ అవసరము. చూస్తు సాయంత్రము వస్తాను" అతను వెళ్ళిపోయాడు.

"ఆమె అచేతనంగా కూర్చుండిపోయింది. చాలావేపటికి కొంచెము వచ్చినట్టు కబురుఅంది భోజనానికి క్రిందికి వెళ్ళింది.

"ఏం తోచటం లేదు పిన్నీ మీఇంటికి వెళ్దామా?"

తలాడించింది.

మారుటి కుమారునితో తమహాలంలో ఉన్న పెద్దునేరింది శశి. అక్కడిదృశ్యము చూడగానే కడుపులో దేవినట్లయింది. ప్రసన్న హాలుదగ్గర బట్టలుఉతుకుతుంది ప్రేమ పిండుతుంది. వేణు ఆరవేస్తున్నాడు. పెద్దు కవతల వేసిన చిన్న గుడిసెలో, కట్టెలనుడిదుతుంది కనకదుర్గమ్మ. ఉమాపతి నులకమంచంలో పడుకున్నాడు.

"యెలా ఉంది నాన్నా?"

"రోజులు లెక్కపెడుతున్నాను. మీ అబ్బాయా?" అన్నాడు యువకున్నిచూచి.

"అవును నాన్నా. మీరు అంత నిరాశగా మాట్లాడితే యెట్లానాన్నా? పక్షవాతం యెంతమందికి రాలేదు. బాగవడంలేదు."

"కూర్చో అబ్బాయ్." అని తల్లి దగ్గరకు వెళ్ళింది. ప్రేమ, వేణు పరుగున వచ్చి పాపను అందుకున్నారు. వారిచేతులు చల్లగా ఉన్నాయేమో. ఒకటే ఏడుపు మొదలుపెట్టింది.

"నువ్వెప్పుడొచ్చావే? యింత ఉప్మా చేసి ఏడుస్తామని అరగంటనుండి వొయ్యి ముందు కూలబడ్డానే. పచ్చికట్టెలు మండిచావటంలేదు, పాప ఒల్లు చెయ్యానేలేదు." చేతులు చీరకుతుడుచుకుని పాపనెత్తుకుంది.

"నాన్నగారు తిరుగుతున్నారాఅమ్మా?" అని అడిగింది.

అక్కడే ఉన్న పీట వాల్చుకుని కూర్చుంటూ "తిరుగుతారేమో! ఆయన మంచమెక్కి బాగానే ఉన్నారే మధ్యన నేను చస్తున్నాను. ఏం మాట్లాడినా పిచ్చి ఎత్తినట్టే మాటాడుతారు. నన్ను సాధించితే ఆయనకేం ఒరుగుతుందో!"

"తమ్ముడూ అంటూ పెంచి పెద్దచేసి ఈ కష్టం కొనితెచ్చుకున్నాను. ఇదంతా దానిమూలంగానే వచ్చిందే. దానికి నా కష్టాలన్నీ రాను. యెవడినో కట్టుకుని కులుకుతుందటగా?"

ఈసారి శశికి తల్లి మీద కోపం వచ్చింది "మన కర్మకు యెవరినెందుకు నిందించాలి. అది మంచి నోములు నోచి నది. చక్కని ఈడు, జోడయిన భర్త. సంసారము ముచ్చటగా ఉంది...."

"ఏమిటే? మీనాన్నగారి పిచ్చే మీ కందరకు పట్టిందా? అది నీకెక్కడి కని పించిందే?"

"మొన్న భర్తతో కలిపి ఢిల్లీ వెళు తుంటే. ఛాయ తేలి, యెంత అంగముగా తయారయిందని? అందరిని అడిగింది. ఎంతో బాధ పడింది."

"కొంపకు నిప్పు పెట్టింది బాలిక, యింకా మన గురించి అడిగిందా సిగ్గుం డాలి ముఖానికి. నువ్వు మాట్లాడినావు నేను అయితేనా పేడ నీళ్లు ముఖాన కొట్టే దాన్ని...."

"ఎవరినే అమ్మా?" అంటూ ప్రసన్న వచ్చింది. పాపను సంబరంగా తల్లి చేతులలోంచి లాక్కుని. శాలువా చేతుల మీదుగా తీసుకుని యెత్తుకుంది. "ఏందిరా చిన్నమ్మలూ! నవ్వుతున్నావా?" పాప బుగ్గలు ముద్దు ముట్టుకుంది. "ఏం శశీ అమ్మ హాటు, హాటుగా ఉంది?"

"సుశీల కనిపించిందక్కా! ఓ ధని తుడిని పెళ్లాడి సుఖంగా ఉందంటే అమ్మ మంచి పడుతుంది."

ప్రసన్న గాఢంగా నిట్టూర్చింది. "ఈ యింట కోపతాపాలే మిగిలినాయి. అతను మీ కుమారుడనుకుంటాను. తాతయ్య పోలి కలు స్పష్టంగా కనిపిస్తున్నాయిలే! ..." పాపను తల్లికిచ్చి త్వరగా విప్పు చేసి, కాఫీ, టిఫెన్లు చేసింది ప్రసన్న. అందరు తీసుకున్నారు. పొలాలు తిరిగి చూచి వచ్చారు.

"ఇక్కడ దగ్గరలో మిషన్ క్యాంపొం డుంది శశీ! వాళ్ళకు టీచరు కావాలట. వెళ్దామనుకుంటున్నాను. నెలాఖరులో బాలా కట-కట లాడవల్సి వస్తుంది.... పిల్లలు నడిచి ఊర్లోకి వెళ్ళలేక పోతు న్నారు. ఓ వంద రూపాయలిచ్చినా నయమే!" అన్నది.

"ఎంతకు దిగజారి పోయామక్కా! కారు లేదేం?"

"ఊర్లోకి క్రొత్తగా వచ్చిన డాక్టరు నాన్నగారిని అడిగి తీసుకెళ్ళారు. కాదన టానికి వీలులేదు. అతనిచ్చిన మందులకు పైసలు యివ్వలేదు. ఇక మిగిలింది ఈ పొలం మాత్రమే!"

"మరి నువ్వు స్కూలుకు వెళ్ళితే పనులకు కష్టం కదక్కా! ఏ జీతగాడి పెళ్లాన్నో పనికి పెట్టుకోలేక పోయారా?" అన్నది శశి తల్లి పడే అవస్థ చూడలేక.

"ఆ సంబరం తీరింది శశీ! అమ్మకు కోపం యెక్కువయింది. మనమున్నా, అమ్మ అన్నా దిక్కు లేనిది కాబట్టి సుశీల పడివుంది. వీళ్ళు ఒకపూట ఉపవాసమైనా వుంటారుగాని, పనికి రారు."

"బావుంది. పట్న వాసాలలోనే నయంలా ఉంది. ఒకరు పోగానే మరొకరు దొరుకుతారు."

ఇద్దరూ మాటాడుతూ కారు దగ్గరకు వెళ్లారు. కనకదుర్గమ్మ అతనితో మాట్లాడు తుంది తనూహించినట్లు. అప్పీ సాను కూల పడితే! శశి అతని భార్య అయ్యేది! నుదిటి రాత తల్లి అయింది. "అమ్మా, వెళ్తాను. యెప్పుడయినా రా. వారం పది రోజు లుండి వద్దువు."

"ఎందుకు లేమ్మా. మవ్వున్నా విశ్రాం తగా ఉండు. అదే చాలు."

తండ్రికి చెప్పివచ్చి కార్లో కూర్చుంది. కారు వెళ్ళిపోయింది. ప్రసన్న పేడ, ఎర్ర మన్ను కలిపి తండ్రి షెడ్డు అలుకుదామని వచ్చింది. అలాటి స్థితిలో తనకూతుర్ని చూసి ఉమాపతి కళ్ళుచమర్చాయి. "తం డ్రిగా నేను, విద్యాలయాలు. సంఘం ఏవీ నేర్పలేని పాఠాలు, పరిస్థితులు నేర్పుతాయి కాబోలు. ఇంగ్లీష్ నవలలు! కొత్త సినిమాలు, లేటెస్టు ఫ్యాషన్ దుస్తులు తప్ప మరేం తెలియని కూతురు యెన్నిపనులు చేస్తుంది!" గొణుక్కున్నాడు.

"ఏం నాన్నా! ఏం చెప్తున్నారు! నా



కేం వివరించటం లేదు." ప్రసన్న తల కొత్తింది.

"ఏం లేదు తల్లీ. వివరించని విష

యాలలో అంత ఆసక్తి దేనికి? పోనీలే అన్నాడు.

"ఏమిటి నాన్నా! రోజుకు రోజూ ఇల

మారిపోతున్నా వేమిటి?"

"నేను ఏమీ మారటము లేదు తల్లీ! నేను చేసిన పుణ్యము విస్తరిల్లి వెంటాడుతుంది." పుణ్యము అనే మాట ఒత్తిపలుకుతూ అన్నాడు. ప్రసన్న మాట్లాడలేదు. తనపని పూర్తిచేసుకుని వెళ్ళిపోయింది. అందరూ భోజనాలకు కూర్చున్నారు.

"ప్రసన్నా! ఆ సంపత్‌గారికి ఉత్తరం వ్రాయి తల్లీ. వేలకు వేలు వాడి చదువుకు తగలెయ్యలేదూ మీ నాన్న! ఇప్పు డాయన మంచమెక్కితే మందు యిప్పించే దిక్కు లేదు. ఈ మాత్రం సంబరానికే "సుతుం గన్నది గతులకొరకు...." అంటారు. ఆడపిల్ల పుట్టగానే అయ్యో అని ఈసడించుకుంటారు. మొగపిల్లవాడు గానే నెత్తిన తేనె కలిపినట్టు మురిసిపోతారు." అన్నది ముద్ద కలుపుతూ.

"అమ్మా! కూర కారంగా ఉందే." ప్రేమ మారాం చేసింది.

"కారం తక్కువే వేశానే. నెయ్యి లేదు. చెప్పు జీతండబ్బుతో తెప్పిస్తాను యెక్కడయినా ఓ గేదె ఉందేమో చూడమని. పాలు, పెరుగు లేనిది ఎంత కష్టము."

"కష్టము సంగతి దేము డెరుగు. ఇప్పుడు డబ్బు లెక్కడివమ్మా?" ప్రసన్న అడిగింది.

"ఏదో ఏర్పాటు చూడొద్దూ! నాల్గు అయిదు పెట్టెలనిండా పుస్తకాలు, అయిదారు బ్యాగులలో పేపర్లు .... ఎక్కడత చూడు అవే. అన్నీ అమ్మివేదేశాను వా డెవడో నాల్గుఅడవం ముక్క కొచ్చిన వాడు. నీ పుస్తకాలన్నింటికి నాల్గోవంతున ధరకట్టాడులే. నూటయాభై రూపాయలు వచ్చాయి." తన కదృష్టమ్మ చెప్పుకుపోతోంది. ప్రసన్న కనులవెంబడి కారే నీరు ఆమె చూడటంలేదు. అందలమెక్కిపోయి అగాధంలో పడ్డవారు. దానినుంచి బయటికి రావటానికి యెంతో ప్రయత్నం చేస్తారు. ఆ ప్రయత్నములో తమ చేతి కందినది. పామో, కొమ్మో తెలుసుకోలేరు. దుర్గమ్మ పని అలాగే ఉంది. రోజు ముడిమెతుకులు పిల్లలకు పెట్టేటప్పుడు ఆమెకంట నీరూరుతుంది. అందుకే మంచి, చెడు ఆలోచించక, మంచివి, పెద్దవి యింట్లో ఒక్క కాగితపు ముక్క లేకుండా అమ్మివేసింది. అమ్మడానికేం మిగిలాయి గనక? యేనాడు లేనిది శని దేవత ఆవహించినట్లు. నగలన్నీ తీసి భర్తవెంట వెళ్ళింది. బయటి దొంగలకే భయపడింది. కాని యింటిదొంగలు ఇంత పని చేస్తారని ఊహించనైనా లేదు. మంగళసూత్రం తాడు. రెండు బంగారు గాజులు మిగిలాయి. దుస్తులకు మాత్రం యింకో అయిదు సంవత్సరాల వరకు కొరత లేదు.

* * *

"రా శశీ! నేనారోజు చెప్పితే ఇప్పుడు తీరవదా? పాప నిద్రిస్తుంది! ఏం పేరు

పెట్టావు?" శశి కెదురేగి కౌగలించుకుని, పాపను ముద్దు పెట్టుకుంది సుశీల.

"ఒక్కసారి వచ్చి అరగంట ఉండి ఆషుమేఘాల మీదొచ్చి కబుర్లు చెప్తుంది వంగవాదిలా! అత్త మంచిది గాదు-పోవద్దురా!" పాపను లాక్కోబోయింది చిరుకోపంతో.

"మలి కాల్లో వాన మంచిదన్నావుగా?" బిక్క మొహం వేసింది పాప. ఇద్దరూ పక-పకా నవ్వారు. వచ్చి కూర్చున్నారు. "పసిపిల్లలు యెంత అమాయకులో చూడు."

"అంత పరవశించి పోకు త్వరలో నువ్వు యెత్తుకునేలా ఉన్నావుగా పసిదాన్ని."

"పసివాడిని అను." అన్నది సుశీల సిగ్గుగా చూస్తూ.

"అదేమిటే! అప్పుడే కట్నాల మీదికి మనసు పోతుందా? నీ ఆశ కూలా!"

"కట్నం-కానుకల కోసం కాదు శశీ! ఆడపుట్టక షట్టి మనము అనుభవించాము కాదూ? అదే నేను మొగాడినయితే ప్రేమకు కాబోయే భర్తగా అత్తయ్య చేతిలో దర్జాగా పెరిగేదాన్ని-పగవారికి కూడా ఆడజన్మ వద్దే ..."

"సుశీ! అని! సుఖాలు ఉన్న మనిషే యిలా అంటే నేనేం చెయ్యనే! మువలి మొగుళ్ళను కొంగున ముడి వేసుకుని. యెన్నో అఘాత్యాలు చేసిన కథలు విన్నాము. ఆతని అంగులకు మడుగు లొత్తుతూ పాప పేర కొంత ఆస్తి రాయించలేక పోతున్నాను."

"పోనిలే. దాని అదృష్టమెలా ఉన్నదో అంతా ఆస్తి పాస్తులున్న వారేనా?"

"అవును దానికి నిదర్శనము నువ్వున్నావుగా!సుశీ! అనుభవమునేర్పిన పాఠాలు యేదడులు నేర్పవు. కనీసం యెవరికి సహాయం చెయ్యకపోయినా హాని చెయ్యద్దనే నిర్ణయం చేసుకున్నాను. నాలో ఉన్న యే కొద్ది మంచితనము. మానవత్వమూ నా పాపకు రక్షగా నిలుస్తే చాలు" అన్నది. ఊరిన కన్నీరు బ యటకు రానీయకుండా.

"మీ అమ్మాయి పెళ్ళి యెంతవరదాక వచ్చింది?"

"వేసవిలో అవుతుందేమో! అమ్మ అక్క పెళ్ళి గురించి ఒకటే ఓగులు

---

కర్తకుని భార్య భర్తతో :—కొన్న ధరకే సరుకును అమ్ముతున్నా మంటున్నారు. మరి లాభం ఎక్కడుంది?

ర్తకుడు :—త్రాసులో.

పడుతుంది. ఏమవుతుందో ఏమో!.... అవెప్పుడూ ఉండె గొడవలేగా! ఎన్నో మానము!''

''ఏడు. ఏమవుతుందో యేమో దిగులుగా ఉంది శశీ. అమ్మ, వేరే అడదిక్కు లేదు. అనసూయ పిన్ని వాళ్ళకు దూరం ట్రాన్స్‌ఫర్ అయిందట. ఆమె ఉంటే తప్పక వచ్చేది.''

''ఇప్పుడేమయింది? నేను లేనూ?.. చిన్నప్పుడు తెలియక అతిశయాలకు పోయాము. ఇంకా మారలేదనుకున్నావే'' ఇద్దరు మాటల్లో ఉండగా రేడియో ఫుల్ వాల్యూమ్‌లో వినిపించింది.

ఉలిక్కిపడి చూచారు. పాప కుర్చీ యెక్కి రేడియో తిప్పుతున్నది. శశి పరుగున వెళ్ళింది. ''దీని చేతులకు పట్టీలు వేయాలి. ఇంట్లోనూ అంతేనే! ఒక్క సామాను ఒక దగ్గర ఉంచదు''

''పిల్లలు కాక మనము సర్దుతామా?'' అవి సుశీల నవ్వుతూ పాపకు బిస్కెట్లు, చాకలెట్లు పెట్టింది. సాయంత్రము వరకుండి, ఫలహారం చేసి వెళ్ళిపోయింది శశి.

సుశీల సరిగ్గా తిండి తినలేక పోయింది. భర్త ప్రొద్దుట వెళ్ళి యింతవరకు రాలేదు, తను నిండు మనిషి. ఏ క్షణములో ఏం జరుగుతుందో? మంచముపై దొర్లుతున్నది గాని నిద్ర రావటం లేదు. రెండు గంటల ప్రాంతములో వచ్చాడు సుధీర్. ''దాదా! సుశీల అన్నం సరిగ్గా తింటున్నదా?''

''ఈ మధ్య ఒకటే దిగులుగా ఉంటున్నారు బాబూ! మధ్యాహ్నము, వారి వదిన గారు వచ్చారు, ఆమె ఉన్నంత సేపు సంతోషంగా ఉన్నారు. ఆమె వెళ్ళగానే దిగులు పడిపోయారు.''

సుధీర్ మరేమనక వచ్చి తలుపులు వేశాడు. అప్పుడే లేచి తన మనసులోని దిగులంతా వెళ్ళగక్కాలి అనుకుంది.. కాని, అలసి వచ్చారు. విసుక్కుంటే? భయంతో కళ్ళే విప్పలేదు. బలమైన చేయి తన చుట్టూ చుట్టుకోగానే, అన్నీ మరిచి నిద్రబోయింది.

ఆమె అడుగవల్సిన అవసరమే లేకపోయినది. మధ్యాహ్నము రెండు గంటల తప్ప. మిగతా సమయమంతా ఇంట్లోనే ఉంటున్నాడు. కబుర్లతో, షికార్లతో సినిమాలతో రోజులు నిమిషాల్లా దొర్లిపోతున్నాయి ఒక శుభ గడియలో సుశీ కోర్కె నెరవేరింది. పండులాటి మొగబిడ్డడు కలిగాడు. సుధీర్ గర్వంగా-సంతోషంగా చూచాడు వాడిని.

''అంత సంబర పడుతున్నారు! మోసుకొచ్చాడని మీ కుమారుడు?'' సు భర్తను వెక్కిరించినది

సుధీర్ నవ్వినాడు. ''అక్కడికి సంతోషం లేనట్టు. మనము ఆనందం అనుభవించి ఊరుకుంటున్నాము. తాత బ్రతికి ఉంటే ఊరు, వాడ

ఒక్కటి చేసేవాడు, ఇప్పటికి మరుపురాని దినము సుశీ! పదో క్లాసు పాసయిన నాడు ఆయన సంతోషం యింతా అంతా కాదు. ఆనాడు ఊరంతా పండుగ చేసుకున్నారు'' యెటో చూస్తూ చెప్పాడు

''మరి జమీందారు అన్నారుగా? ఏ ఊరు? ఆయన యెక్కడి కెళ్లారు? యెప్పుడూ చెప్పరేమండీ!''

''వద్దులే సుశీ! అవన్నీ మధుర స్మృతు లుగానే నా గుండెలలో ఉండనియ్యి వాటిని త్రవ్వి దాని వెనుకాల జరిగిన దారుణాలు జ్ఞాపకం రానియ్యకు. మనమిలాగే హాయిగా ఉందాము. గతం త్రవ్వడం దేనికి?'' అన్నాడు. అతని కనులలోకి చూచి, బాధ పడుతాడని మరేం మాటాడ లేదు. అతని యింటి దగ్గరి కబుర్లు చెప్పి స్విరంచాడు ''శశికి ఫోను చెయ్యలేదా?''

''చేశాను ఆమె ఊరిలో లేదుట. ల్గి రోజులయితేగాని రాదుట'' అన్నాను

''బాబుకు ఏం పేరు పెడదామండీ?'' న్నది. వాడి మూసుకున్న పిడికిళ్ళు తీసిస్తూ.

''అన్ని పుస్తకాలు చదువుతావు. ఏదో పేరు యెన్నిక చేయి.''

''అలా కాదు. మీ నాన్నగారి పేరు, నాన్నగారి పేరు కలిపి పెడదాము నాన్నగారి పేరు చెప్పండి. ఇద్దరికి రటి మనుమడేగా.'' అన్నది కుతూ ంగా.

నాన్నగారి పేరు చాల పొడవు. శ్రీ రాజారామకృష్ణరామ్. ''అన్నాడు సంతోషంగా.

''అయితే ననము పొట్టి చేద్దాము. శ్రీ రాజారఘురామ్. అని పెడితే.''

''అక్కడికి అదె పొట్టి అయినట్లు! సరే. 'రాజా' అని పిలువ వచ్చు రేపే వెళ్లొచ్చనన్నారు డాక్టరు. వెళ్లిపోదామా?'' అనలతనికి పసి వాడిని వదిలి పోవాలని లేదు

''అవును నాకు యిక్కడ విసుగ్గానే ఉంది. దినమంతా దగ్గరే ఉండే వాడు. ఇవతలి-అవతలి గదులు దినమంతా బంధువులతో, స్నేహితులతో కిటకిట లాడి లాడేవి. అదంతా విని, చూచి ఆమె యెక్కడ నొచ్చుకుంటుందోనని, అవతలికి జరిగేవాడే కాదు. అతని కబుర్లు వింటూ తన బాధను-ఆవేదనను మరిచిపోయేది.

బాబుకు రాజా అన్న పేరు ఖాయం అయినది. అతను పెద్దగా ఆడంబరము చెయ్యటానికి అంగీకరించలేదు. రాజా నామకరణోత్సవము పురస్కరించుకొని. బీదలకు అన్నవస్త్రాలు దానం చేశారు.

''చూడు సుశీ! ఈ సొసైటీలో పెద్ద మనుష్యులను పిలిస్తే నాజూకుగా సగం తిని, సగం పారబోస్తారు. లేనిపోని హంగామా. ఆ బీదజనులను చూడు ప్రతి మెతుకు విలువయినదిగా యెంచి తింటు న్నారు. వారికి భుజించామన్న తృప్తి

మనకు పెట్టామన్న తృప్తి మిగులుతాయి. ఏమంటావు?''

''నిజమే! మీరెంతో ఆలోచించే పని చేస్తారు. మరి కొందరయితే బహుమతుల కోసం పిలిచామన్నట్లు ప్రవర్తిస్తారు .. అత్తయ్య యింట్లో చూచే దాన్నిగా?'' రాజాకు స్వెట్టరు వేస్తూ అంది. మంచి ప్లేటు స్టాండుగల ఉయ్యాల, రకరకాల దుస్తులు, ఆటవస్తువులూ తెచ్చాడు.

రాజాకు నీళ్ళు పొయ్యటానికి, మంచి-చెడు చూడటానికి ఓ స్త్రీని కుదిర్చినారు.

''ఏమండి; ఒక్కసారి అత్తయ్య వాళ్ళింటికి వెళ్లాను. నా బాబును చూపించి వస్తాను. ఆమె ముఖం యెలా మారుతుందో చూడాలి.''

''వద్దు సుశీ! ఆమెలాంటి వారు మారరు. పైగా ఆవిడ శాపనార్థాలు వినాలి. అచ్చు దుర్గమ్మే! ఆమె కుమారుడు మద్రాసులో వ్యాపారం చాలించి, చింకి ప్యాంటుతో యిల్లు చేరినాడు. దానికి నీవే కారణం అనుకుంటుంది. దీవెనలు లేకపోగా, తిట్లూ, శాపనార్థాలు దేనికి? మనకు భగవంతుడొక్కడే నిజమైన బంధువు. ఏం రాజా?'' కొడుకును ముద్దాడినాడు.

సుశీల యెదురు చెప్పలేదు సంతోషమైనా, దుఃఖమయినా ఇతరులతో పంచుకున్నప్పుడే వానికి పరిపూర్ణత లభిస్తుందని అతనికెలా చెప్తుంది? తను వివాహితురాలై, మాతృమూర్తి అయినా ఆ యింటనున్న ఒక్కగా నొక్క శ్రేయోభిలాషి మామయ్యను చూడాలని ఉంటుందని ఎలా నచ్చచెపుతుంది? ఆతని భయం అతనిది తన కుమారునిపై యితరుల దృష్టి పడకూడదని అతని భావన. దుర్గమ్మనూ, ఆమె నోటి దురుసుతనమునూ ప్రత్యక్షముగా చూచినాడు. సుధీర్‌కు రాజా తోటిదే లోకము. ఇంట్లో ఉన్నంతసేపు తాను పసివాడై ఆడుతాడు.

బాబుకు డ్రస్సు, ఆట వస్తువులు తీసుకుని శశి వచ్చింది. సుశీలకు యెక్కడలేని ఉత్సాహము వచ్చింది.

''ఒట్టి పిసినారి పెద్దమ్మ వేమే! మీ బాబు నామకరణోత్సవానికి పిలువలేదూ?''

''చెప్పానుగా? ఆయనంతా అదోరకప్పు మనిషే! బీదలకు అన్నము పెట్టించి అయిందనిపించారు.''

''మంచిదిలే! ఉన్నవాడికి, ఉన్నవాడు పెడితే ఏం లాభం? మీవాడు నవ్వుతున్నాడే!'' రాజాను యెత్తుకుని ముద్దులు కురిపించింది శశి.

''ఇంకా యింటిదగ్గర విశేషాలు చెప్తావనుకుంటే....''

''ఏమున్నాయి సుశీ! ఆశాజనకమైనవేమీ లేవు. అన్నయ్య తిరిగి వచ్చినాడు పూర్వపు పద్ధతే! ఇంకా కొన్ని అదనపు అలవాట్లు నేర్చుకు వచ్చినాడు. మొన్న

ఓ పెళ్ళికొడుకు అక్కయ్యను చూచి నచ్చిందన్నాడట. ఎక్కడో ఆఫీసులో అప్పర్ డివిజన్ క్లర్క్‌గా పని చేస్తున్నాడట కట్నం అయిదు వేలు అడిగినాడు. ఆ డాక్టరుకే కారు తెగనమ్మి అతనప్పు పోగా మిగిలిన రూపాయలు తెచ్చారు.... పెళ్ళి నిశ్చయం చేసుకుందామని వెళ్ళేసరికే. వీళ్ళు త్వరలో జవాబు చెప్పలేదని యింకోవైపు నిశ్చయము చేసుకున్నారట. అమ్మ మరీ దిగజారి పోయింది. ఆ డబ్బు తనకియ్యటం లేదని ఒకటే చిర-చిర లాడుతున్నాడు అన్నయ్య."

"చిన్న బావ దగ్గర నుంచి ఉత్తరాలు వస్తున్నాయా అతనికి పిల్లలా?"

"ఏమో! అక్కయ్య యింటి పరిస్థితి వివరిస్తూ మూడు నాల్గు ఉత్తరాలు రాసి విసుగెత్తి ఊరుకున్నది. మీ వారు ఎప్పుడొచ్చినా కనిపించరేమే?"

"ఆయన నన్ను నామకార్థానికి పెళ్ళి చేసుకున్నారు. అసలాయన పెళ్ళి వ్యాపారంతో అయ్యింది. ఈ మధ్య పోవటం లేదులే! ఈరోజే పని ఉందని వెళ్ళారు." శశి కూడా తొందరగానే వెళ్ళిపోయింది.

కుండపోత వర్షంగా కురువ సాగింది. కిటికీల అద్దాలు దించి వచ్చింది సుశీల. ఆయా రాజా ఉయ్యాల దగ్గర పడుకుంది. రాత్రి తొమ్మిది దాటినా సుధీర్ జాడ లేదు.

[సశేషం]

జ్యోతి పాఠకులకు
రాబోయే సంచికనుండి
ఫొటోలతో సరిక్రొత్త శీర్షిక

నిర్వహణ, ఫోటోలు :
జి. యస్. భూషణ్

# పదబంధ ప్రహేళిక

శ్రీ-శ్రీ




### అడ్డము

1. (కుక్కుటేశ్వర?) సుప్రభాతం.
3. తెలుగులో ఏడవడం.
7. యు. యస్. యస్. ఆర్
8. ఈ దబ్బు ఈశ్వరి రంగు
10. చెప్పుల కంపెనీకి మార్గమా?
11. మీదకి చూడు
12. కొన్ని భాషల కిది లేదు
14. ప్రమాదాల కొక కారణం
15. అసస్థ కర్ధం 11.
17. భూదేవి కరుణ.
19. కరుణకే మరో పేరు
21. ఇబ్సెన్ హీరోయిన్
22. పూజకు 19
24. 61లో ఒకటి; ఇదో పత్రిక.
27. 11 నిలువు. కేరళ పత్రిక.

### నిలువు

1. రోషనార సుబ్బారావుగారి ఇంటి పేరు.
2. 24 గంటలు.
4. ఉత్తరాలు.
5. ఒకటా, 4 మార్లు: గుడ్ బై మార్లు.
6. భార్య నిత్య బహువచనం కాదు.
8. మనవి కాని దారిలో ప్రవహించేది.
9. వలపులిచ్చే వనితలో భయపడదాని కేముంది?

11. కొన్ని తరగతులదాకా ఆంధ్ర విద్యార్థులకు ఆట విడుపు.

13. .. కాలం: తర్వాత.

16. (27 చూడు).

18. ఈ కవి కాళిదాసు..

19. .. ఇది రచించాడు.

20. మనదేశంలో దారిద్ర్యంతో బాటు పెరుగుతున్నది.

23. అరవిచ్చిన కళ్ళల్లో అర్థరాత్రి ఏడ్వవొద్దు.

25. 7లో వీరవనిత.

26. సాయిబాబా జాతరలో వినవచ్చు.

ప్రతి నెల 20వ తేదీ లోగా పూరించిన పజిలు మాకు చేరవలయును.
ఆల్ కరెక్టు వాళ్ళకు ఒక 'జ్యోతి' ని బహుమతిగా ఇవ్వగలం.

## జూలై నెల పజిల్ క్లూ

### అడ్డము

1. పరుగులు.
3. శ్రీనాధుడు.
7. నేల
8. కలత.
9. పావు.
12. మహాభి నిష్క్రమణ.
15. ధగ్గు.
16. పడవి.
17. దేగ.
20. గుడిపాటి.
21. కాలనేమి

### నిలువు

1. పదునేడు.
2. గుడి.
3. నాభి.
5. దుముపులు
6. అంనని పెదనా.
10. నహారా.
11. తామర.
13. ముందడుగు.
14. మగటిమి.
18. పీపా.
19. తల.

### ఆల్ కరెక్టు

యం. శ్యామల. కర్నూలు.

### ఒక తప్పు

(1) శ్రీకారం కామేశ్వరి. హైదరాబాద్.

(2) కె రామబ్రహ్మం. గుడివాడ.

(3) పాడేటి కృష్ణమోహన్. తువి.

(4) పద్దూరి నరసింహారావు. యూరోప్.

(5) భట్టారం ఉపయపి. నంద్యాల.

(6) పి. సీతామాలి. అనంతపూర్.

(7) వి రమేష్‌చంద్. ఒంగులూరు.

(8) పద్దాని సూర్యారావు. షష్టి-5.

(9) వి. వెంకటరమణమూర్తి. విశాఖపట్నం.

(10) పామర్తి శ్రీనివాస్. సికింద్రాబాద్.

(11) రఘుకుమారి. మద్రాసు-8.

(12) బి. జి. ఆనందరావు. హైదరాబాద్.

(13) తూబాటి నాగభూషణరావు. చిలకలూరిపేట.

(14) లక్ష్మణ్‌బేగ్. గుంటూరు.

(15) సంగాపు సత్యనారాయణ. మోదుకూరు.

(16) చౌదూరి అన్నపూర్ణశర్మ. హైదరాబాద్-28



మీ ప్రశ్నలకు

# శ్రీమతి సూర్యకాంతం

జవాబులు

: ఏమండీ! ఆ కాలంలో 30 సంవత్సరాల యువకునికి వధువు దొరికేది కాదట సామాన్యంగా. కాని యిప్పుడు 30 సంవత్సరాల యువతికి వరుడు కావాలి అని పత్రికల్లో ప్రకటనలు వేస్తున్నారు. ఏమిటండీ, యీ విచిత్రం?

ఎమ్. శంకరరెడ్డి, బెల్లంపల్లి.

జ: ఆ కాలం సంఘం కట్టుబాట్లు అవి. ఈ కాలం ఇది. నీ ప్రశ్న మరీ విచిత్రంగా ఉంది. రెండు కార్డులు ఒకే ప్రశ్నకు వ్రాయడం నీదే కాలం తెలివి.

ప్ర: మీ నటులను, నటీమణుల్ని సమాజంలో మీరు 'పెద్దవారు' అని తలంచే వారిపై మీ అభిప్రాయం ఏమిటి, సూర్యకాంతం గారూ?

కె. వీరనారాయణ, వరంగల్లు.

జ: పెద్దవాళ్ళు ఒక్క నటీ-నటులే కానక్కరలేదు. 'పెద్దవాళ్ళు' సమాజంలో నేటికీ అన్నిటా ఉన్నారు కదండీ - వేరే చెప్పాలా!

ప్ర: ఏమండీ! సూర్యకాంతం గారూ! మీ శ్రీవారి పేరు ఏమిటండీ? ఉద్యోగమేదైనా చేస్తారా? లేక ఖాళీగానే ఉంటారా?

ఎం. సుబ్బారావు, తాడేపల్లి.

జ: శ్రీవారి పేరు చెప్పొచ్చా!... ఉద్యోగమా!

ప్ర: శ్రీమతిగారూ! తిమ్మరుసువలె సమాధానము చెప్పక, నక్షత్రాల సంఖ్య ఎంతో సవినయంగా సమాధానం చెప్పండి చూద్దాం?

ఎస్. వి. రాఘవేంద్రరావు, చెల్లూరు.

జ: మిసుతం ఛాటు తోస్యంతా ఉంది ఏ సంగతి. నేటి సమాజములో

అనేక సమస్యలు ఉత్పన్నమౌతున్నాయి. అనేమీ పీ బుజ్జి కెక్కలేదా యీ చొప్ప కంటు ప్రశ్న తప్ప.

ప్ర: అప్పబ్బో...ఏమందం సుందరీ! ఉబ్బి తబ్బిబ్బై పోతున్నాను. తట్టుకో లేకున్నాను.

యం. వెంకటేశ్వర్లు, ఖమ్మం.

జ: ఓరి పిచ్చోడా! అబ్బో-అబ్బో! అయితే నీకు వెంటనే పెళ్ళి చేసెయ్యాలి. ఇంక ఆగడానికి వీల్లేదురా బాబూ!

ప్ర: సూర్యకాంతం గారూ! మీ ఎడంచేతి సరసం మీ శ్రీవారిపై ఏ రకం పరిపిస్తుంది?

జ: ఎడమచెయ్యి మీ బోటి వారికే రిజర్వు చేశా! శ్రీవారికైతే దండుగ.

ప్ర: సూర్యకాంతం గారూ! మనిషి ఎందుకు జీవించాలంటారు?

జ: పది మందికి పనికి వచ్చే మంచి పనులు చేయటానికి.

ప్ర: భార్యను ఎప్పుడూ వేధించుక తినే భర్తకు గుణపాఠం నేర్పేదెలా?

ధనంజయపాత్రో, బరంపురం-4.

జ: ——————

ప్ర: అత్తా! నేను రేపు దసరాకు మీ ఇంటికి వస్తున్నా! ఎటువంటి లోటు లేకుండా...బీ కేర్...?

తాడాల రామకృష్ణ, పిఠాపురం.

జ: దాక తగలబెట్టి దసదూడ గొట్టి అయ్యయ్యో అల్లాటా అయిపోయినావ పువి మర్యాద చేస్తా-రా రా! తప్పక రా!

ప్ర: ఏమండీ! జనరల్‌గా జీవితంలో స్త్రీకి మరువలేని అతి ముఖ్యమైన దశ ఏదంటారు?

ఎస్. సత్యనారాయణరావు,

గోపాలపట్నం,

జ: మహర్దశ.

ప్ర: యవ్వనమా? ప్రౌఢత్వమా? ఎందువల్లో కాస్త వివరిస్తారా?

జ: బాల్యం నుండి వరసగా అన్ని దశలను చూస్తూ ఆయా జ్ఞాపకాలను నెమరు వేసుకుంటూ ఆనందించే ముదిమి! ఇంతకీ మనదే దశ?

ప్ర: అత్తమ్మా! నీవు గరిట పుచ్చు కోనంటే ఒక చిన్న మాట! "ఆడది తిరిగి చెడింది" అన్న సామెత మీ సినిమా తారలకు ఎంతవరకూ వర్తిస్తుంది?

ఉమ, గోపాలపట్నం,

జ: నీవు చెప్పే సామెత చక్కగా పెళ్ళి చేసుకుని కాపురం చేసుకునే అమ్మా యిలకే నప్పాయి. మేము 24 గంటలూ రాట్నంలా తిరగకపోతే మా పనులు జరగవు మరి....

ప్ర: అత్తమ్మా! ఏదో ఒకగమ్యంలో "ఇదే సత్యం" అని మనని మనం సమా ధాన పరచుకొని ఆగాల్సిందే కాని, దాని స్వరూపం ముఖ్య అవసర సమయంలో మనకి అవగతం కాదు, ఎందుకో మరి?

జ: అదే 'స మ య స ం జీ వి' అంటారు.

ప్ర: అత్తమ్మా! మీ జీవితంలో ఏదైనా మరువరాని సంఘటన_జ్ఞాపకంగా మిగిలి పోయిందా? ఈ ప్రపంచంలో దేనికి ముఖ్యస్థానం వుందంటారు?

హేమలతా దేవదాస్, నిజామాబాద్.

జ: నన్నడగాలి అవి కాకపోతే నీకు మాత్రం తెలియదటమ్మా—పిచ్చిదాన!

ప్ర: నూరి అత్తయ్యగారూ! మీకు సినిమాల్లోను, నిజ జీవితంలోనూ భేదం ఉందని నేను; మా ఫ్రెండ్ లేదని అంటోంది. ఎవరిది కరక్టు - కాస్త చెపు చెపుతారా?

కె. సుబ్బలక్ష్మి, విశాఖపట్నం.

జ: ఎంతముద్దుగా పిల్చావే నా పిచ్చి సుబ్బీ. నీ పేరు నాకు మహాముద్దుగా ఉంది సుమా! మీ యిద్దరు రైటేనే! సరేనా!

ప్ర: నేడు మనకు కనుపించుచున్న అసభ్య చిత్రాలకు గిరాకి హెచ్చుగా యుండుటకు గల కారణములను వివరింప గోరెదను?

ఎస్. వి. కె. రామానుజ,
శృంగవరపు కోట.

జ: మీబోటి మహాశయుల ఆదరణ, అపేక్ష, ఆశ వగైరా-వగైరా కల్పి గిరాకీ హెచ్చినది కదు బాబూ!

ప్ర: అమ్మాయిల అందాలురాణించాలంటే "అక్కినేని" కావాలి. ఏమం టారు?

జ: శహబాష్, నాగరాజూ! నాగ స్వరం నాబాగ్గా ఊదావు.

ప్ర: మద్రాసు వస్తే మిమ్మల్ని కల్సుకోనెందుకు మీకేమైనా అభ్యంతరమా?

జ: అందమయిన అమ్మాయిలంటు న్నావు. వద్దు బాబూ, వద్దు. మరెక్క డికైనా వెళ్ళు.

ప్ర: నూరేళ్ళంతం అక్కయ్యా గారూ! మీతమ్ముడిగా అడుగుతున్నాను. మీ ఫోటో ఒకటి పంపిస్తారా? భద్రంగా దాచుకుంటాను.

కె. నాగరాజులు, ఏనవేడు

జ: అలాగే.

ప్ర: "అత్తమ్మా" అని అన్నానని కోపగించకండి. మీరు నటించిన 'నటనను చూసి మామయ్య ఏమంటాడు? గయ్యాళిగా నటిస్తున్నంత వరకూ మీ మనస్సు ఎలా ఉంటుంది?

ఎస్. హేమలతా దేవదాస్,

జ: ఇంతకు ముందు చెప్పగా మామ య్యకు మాత్రం తెలియదు. కనుకనా అది నటన అని.

ప్ర: అక్కయ్యగారూ! హీరో యిన్ గా ఏ చిత్రంలోనైనా నటించారా?

కె. నాగేశ్వరరావు, తాడేపల్లి గూడెం.

జ: అబ్బెబ్బే! లేల్లేను....

ప్ర: ఏమండీ! శ్రీమతిగారూ! మీది ఎన్. టి. ఆర్. పార్టీనా? ఎ. యన్. ఆర్. పార్టీనా? 'ఇద్దరి పార్టీ' అని మాత్రం చెప్పకండి.

జయచంద్రప్రకాశ్, పలమనేరు

జ: ఓలే వాటమే! ఎన్. టి ఆర్. ది నా పార్టియే, ఎ. యన్. ఆర్. ది నా పార్టియే! మీకింకా తెలియదా!

## ఏమా వృద్ధి! ఏమా వింత!
## టానిక్ వల్ల అంత గొప్ప వ్యత్యాసం కలుగ గలదా?





# ఎదిగే వయస్సే, ఇన్‌క్రిమిన్* సేవించే వయస్సు

### ఇన్‌క్రిమిన్* మీ బిడ్డకు ఎదిగేందుకు ఆకలిని కలిగిస్తుంది

▼ పెద్ద పిల్లలకు లైసిన్‌తో కూడిన ఇన్‌క్రిమిన్ సిరప్. 175 మి.లీ. మరియు 57 మి.లీ.

▼ పసి బిడ్డలకు 10 మి.లీ. ఇన్‌క్రిమిన్ డ్రాప్స్














అన్ని మందుల షాపులలో లభించుచున్నది. ఇన్‌క్రిమిన్ తయారు చేయువారు లెదర్లీ—అంతర్జాతీయంగా నమ్మకమైన పేరు. లెదర్లీ డివిజన్, సయానమిడ్ ఇండియా లిమిటెడ్. 254/డి 2. డా. అ. బిసెంట్ రోడ్. బొంబాయి 25.

*అమెరికన్ సయానమిడ్ కంపెనీ వారి రిజిస్టర్డ్ మార్కు

లింటాస్ - INC. 15-500 TL

# బంధారోప హాసాలు

పవని నిర్మలప్రభావతి



ట్రాన్స్ఫర్ ఆర్డర్ చదువుకున్న మూర్తి పెదవులపై చిరునవ్వు వెలిసింది.

"ఏమిటది భయ్యా?" ఆశ్చర్యంగా అడిగాడు చరణ్.

"మా ఆంధ్రకు....ట్రాన్స్ఫర్ చేయించుకున్నా....మా వూరికి చీరాలకు!" గర్వంగా చెప్పాడు మూర్తి.

"విజం" మహారాష్ట్ర యువకుడు

నరేంద్ర నమ్మలేనట్లు చూశాడు.

"నిజంగానే! మేనేజరుగారితో నేనే స్వయంగా చెప్పుకుని, అక్కడి ఈ ఆఫీసు బ్రాంచికి నన్ను వేయమని కోరాను. మొదట్లో వద్దన్నారు, గానీ నా మాటకు విలువిచ్చి. వేసారు చివరకు!"

"ఎందుకు బ్రదర్! అంత దూరం వెడతావు? వేరు వేరు రాష్ట్రాల నుంచి వచ్చినా, అందరం కలిపి కట్టుగా, ఎంతో సరదాగా గడుపుతున్నాం ఈ పదేళ్ళ నుంచీ! అలాటిది నువ్వీ రోజు నీ రాష్ట్రానికి వెళ్ళిపోవటం .. మాకేమిటో వెలితిగా వుంది!...." స్నేహపూర్వకమైన బాధ నిండి వుంది బెంగాలీ యువకుడు ఛటర్జీ కంఠస్వరంలో.

"ఒద్దు మూర్తి భయ్యా!" అంది ఫాతిమాబేగం.

"నిజం చెబుతున్నాను మూర్తిజీ!.... మీరు ఆంధ్రకు వెడతారంటే....మీ సుషెన్....మాలతిని వదిలి వుండటమెలా అన్నది దిగులుగా వుంది నాకు!" అంది సరిత.

చుట్టూరా, అందరూ తలకో కంఠం? అరుస్తున్నారు. బాధ పడ్తున్నారు. ఇంత అభిమానాన్ని చూరగొన్నందుకు, తనమీ తనకే గర్వం కలుగుతోంది. అయి లోలోపల తన నిర్ణయం మార్చుక దల్చుకోలేదు.

స్నేహితులను ఎలాగో వదిలించుకుని ఆఫీసునుంచి బయటపడి స్కూటర్ స్టా చేశాడు మూర్తి. అతగాడి మనస్సులాగే స్కూటర్ కూడా ఆఘమేఘాలమీ పోతోంది.

తను ఇక తన బంధువుల మధ్య వెళ్తున్నాడు! ఈ గ్వాలియర్‌లో.... మధ్యప్రదేశ్‌లో ప్రవాసాంధ్రుడిగా వున "ప్రవాసం" రద్దు చేసుకుని, హాయిగా తన వాళ్ళతో కాలం గడుపుతాడు.

చెల్లాయి లలిత. దాని భర్త గోపాలం. ముగ్గురు పిల్లలూ చీరాలలోనే వున్నారు వాళ్ళకు ఉత్తరం వ్రాస్తే సరి. వా ఇంటికి దగ్గర్లో మంచి ఇల్లొకటి చూ పెడతారు.

అమ్మ, నాన్నగారు, పెద్దన్నం

---

చల్లని హృదయంగల వ్యక్తి శిలా విగ్రహంలా తయార పాషాణ హృదయుడనా అర్థం? ఆమాటకొస్తే దేవుడు కూ రాయేగా, మౌనవ్రతుడేగా?!

---

ుతశీ, వదిన శారద, వాళ్ళ నలుగురు
ల్లలూ గుంటూరులో వున్నారు. ఈ
ుతు తెలిసి చాలా సంతోషిస్తారు.

పెద్దనాన్న కొడుకు....తన వయసు
ాడు రాఘవ బాపట్లలో వున్నాడు. పెద్దక్క
కుంతల, ఆమె భర్త శ్రీహరిరావు,
ాళ్ళ పిల్లలు ఐదుగురూ తెనాలిలో
ున్నారు। ఇక ఆ చుట్టుప్రక్కలే చిన్నా
న్నలూ, మేనమామ కొడుకులూ, వాళ్ళ
ంసారాలూ వూరి కొకరుగా, టౌన్
ొకగా వున్నారు.

ఏ వివాహ సందర్భాలలోనో, విధి
ేకపోతే తప్ప. తనకు వారం రోజులు
లవు దొరకదు! ఆ వారం రోజులు కను
ూసి తెరిచేంతలో దొర్లిపోతాయి!....
ిలితనూ, అమ్మనూ, నాన్ననూ, అక్క
య్యనూ, అన్నయ్యనూ అందర్నీ తను
ేరు పేరునా ఆహ్వానిస్తాడు....తన దగ్గ
కు వచ్చి పది రోజులుండమని. ఊహూ!
ాళ్ళు తాలేదెప్పుడూ!

"అంత లేసి డబ్బు పోసి రైలు
ాళ్ళను బ్రతికించటం ఎందుకు? ఈ పిల్లా
ేల్లాతో కదిలి రావటమంటే మాటలా!
ువ్విలా హారతి కర్పూరంలా మెరిసి

మాయవకుంటే, హాయిగా ఇక్కడికే
ట్రాన్స్ఫర్ చేయించుకో రాదూ! ఎలాగూ
మీ ఆఫీస్ బ్రాంచీలు ఇక్కడా పెడుతున్నా
రుగా! ఏమిటో! ఆంధ్రలో ఎక్కడా చోటు
లేనట్లు....మా అందరికీ దూరంగా పోతు
గెత్తావు అంటారు అందరికందరూ.

అది నిష్ఠూరం నిండిన వాత్సల్యం!
తనకూ అనిపిస్తుంటుంది తరచూ. ఏదో
జీతం ఎక్కువనీ, మాంచి "బోనస్"లు
వుంటాయనీ ఇంత దూరం పరుగెత్తుకు
వచ్చాడు. ఈ రోజు బంధువుల కోసం
మొహం వాచిపోతున్నారు తనూ,
మాలతీ.

ఎంతసేపూ బెంగాలీలూ, సిక్కులూ,
పార్శీలూ... ఒకరో-అరో తనలాటి
ఆంధ్రులూ. హిందీ వాళ్ళూ....ఇలా
కలగా పులగం మేళం స్నేహితులతో
పార్టీలూ, పిక్నిక్లూ తప్ప...."మా
బంధువు!" అంటూ చెప్పుకోవటానికెవ
రున్నారిక్కడ?....ప్రమాదాలకయినా,
ప్రమోదాలకయినా వాళ్ళే! ఆప్యాయత
చూపుతారు....కాదనేందుకు లేదు. కానీ-
బంధుత్వంలో ఇంతకు మించిన రక్త
స్పర్శ, బంధం నిండి వుంటుంది.

---

 "మీ సినిమా చాలా భయంకరంగా తీసారుట?"

"తీసిన వాళ్ళం మాకే భయమేస్తోంది - డబ్బులు వస్తాయో రావోనని."

వెలిచేటి శ్రీనివాసరావు, కాకినాడ



పోయినసారి రాఘవ వివాహ సందర్భంగా అటువేపు వెళ్లారు తనూ, మాలతీ, పిల్లలూ.

"ఒరేయ్? మధ్యప్రదేశ్‌కు అంకితమై పోయావా ఏమిట్రా?" అంటూ కోప్పడ్డాడు రాఘవ.

అమ్మ, మాలతితో మరీ మరీ చెప్పించిట... "పెద్దవాళ్ళమయ్యాం-నేనూ, మీ మామగారూ ...ఇక్కడ ఈ పెద్దాడికి మేమంటే ఎక్కడలేని విసుగూ బయల్దేరింది? ఇక కోడలు సరే సరి! మాకు చావెప్పుడొస్తుందాని కనిపెట్టుకూర్చుంది. మీరిద్దరూ మమ్మల్నీ, ఆడపిల్లల్నీ ఎంతో ఆప్యాయంగా చూచుకుంటారు....లలిత, శకుంతలా నిన్ను కలవరిస్తుంటారెప్పుడు! మీరు దగ్గర్లో వుంటే, హాయిగా మీ దగ్గరే వుండేము గదా!"

మాలతి చెప్పుకు-చెప్పుకు మురిసిపోతుంటుందెప్పుడూ! ఏ స్త్రీకయినా, తన తోటికోడలి కంటే, తనని ఎక్కువగా అభిమానిస్తున్నారంటే ఆనందమే కదా మరి!

ఆసారి తాము తిరిగి గ్వాలియర్‌కు వస్తూంటే....తమనెవరో-ఏ కొండ కోనల లోకి దూరంగా విసిరివేసినట్లనిపించి, ఏమిటో బాధనిపించింది. ఈ వచ్చీ రాని తెలుగులో-వేధించే ఈ మిత్రులూ....వీరి వంటకాలూ....తగని వెగటుగా తోచ సాగాయి.

ఈ ట్రాన్స్ఫర్ మాలతికి కూడా ఇష్టమే విని ఎంతో ఆనందిస్తుంది....స్కూటర్‌తో బాటు ఆలోచనలూ ఆగాయి. స్కూటర్ దిగి హుషారుగా లోపలికి వెళ్ళాడు మూర్తి.

సంగతి తెలిసిన మాలతి ఎంతో సంబరపడింది।

వారం రోజుల్లో సామాన్లు సర్ది, పాక్ చేసి పంపేశాడు. తమ కోసం టిక్కెట్లు రిజర్వు చేయించుకోవటమూ అయింది.

మిత్రులంతా స్టేషన్‌కు వచ్చారు.

"వదేళ్ళుగా ఒక్క చెట్టుమీది పక్షుల్లా, హాయిగా .... మళ్ళీ మనం కలుసుకోగలమో....లేదో....దయచేసి మా అందరి స్నేహానికి గుర్తుగా....ఈ చిన్న బహుమతి పుచ్చుకోండి।'' అందంగా నగిషీలు చెక్కిన స్టాండు మీద, వెండి రాధా కృష్ణుల విగ్రహం ఇచ్చారు అందరూ....

క్షణకాలం మూర్తి, మాలతిల హృదయాలు అర్ధ్రమైపోయాయి. మరుక్షణంలో తాము ముందు ముందు చవి చూడబోయే బంధు ప్రేమ గుర్తుకు వచ్చి....కెరటంలా పుప్పొంగిన బాధను, చప్పున చల్లార్చి వేసింది....

ట్రెయిన్ కదిలింది .... గ్వాలియర్ స్టేషనూ....కోట....మెల్లిగా కనుమరుగై పోయాయి....

* * *

''ఇదేం బుద్ధిరా అన్నయ్యా నీకు? ఎక్కడేనా ఇల్లు చూడమన్నావ్? చక్కగా మా ప్రక్క పోర్షన్‌లో చేరకూడదూ?" అంటూ వాత్సల్యంగా కోప్పడింది లలిత.

నవ్వేశారు మూర్తి, మాలతి. లలిత వాళ్ళున్న ఇంటికి ఓ ఫర్లాంగు దూరం లోనే వుంది ఈ ఇల్లు.

రోజూ సాయంత్రం పూట లలిత, గోపాలం, పిల్లలు వస్తున్నారు. వాళ్ళకు రావటానికి వీలుగాని రోజు, మూర్తి, మాలతి, పిల్లలు వెళ్ళి వస్తారు. చాలా సరదాగా గడిచిపోతున్నాయి రోజులు.

వీలుచూచుకుని గుంటూరుకు వెళ్ళారు మూర్తి, మాలతి.

అన్నయ్య మురళి, వదిన శారదల ప్రవర్తన మాత్రం బ్రహ్మ బద్దలు కొట్టుకున్నా అర్థం కాలేదు మూర్తికి.

''అక్కడ ఆఫీసు వర్క్ అదీ వసతిగా లేదా మూర్తీ?'' అన్నాడు మురళి.

"అదేం లేదు।'

''మరి? ట్రాన్స్‌ఫరెందుకు కోరావు?' ఆ ప్రశ్నలో ఏదో కాఠిన్యం మరేదో బాధ నిండివున్నట్లు తోచింది మూర్తికి.

గతుక్కుమంది మూర్తి మనసు, మురళి అన్నయ్యకు తామిక్కడకు.... ఈ ప్రాంతాలకు రావటం ఇష్టంలేదా? ఇందాకా ఏకచ్ఛత్రాధిపత్యంగా 'మేనేజ్' చేస్తున్న 'ఆస్తి'కి ఇకపై తన కన్నూ వుంటుందేమోనని బాధపడ్తున్నాడా? భయపడ్తున్నాడా? ఇంత సంకుచిత స్వభావునిగా మారిపోయాడా అన్నయ్య? మూర్తి అలో చిస్తుండగానే గదిలోకి మాలతి వచ్చింది.

''ఏమిటో మీ వదిన మనస్తత్వం

నాకు అంతు పట్టడంలేదు! ఇలా గడపలో కాలు పెట్టామో లేదో ...తెగ ఇదై పోతోంది! 'ఏం బావుకుందామని వచ్చారు మాలతీ ట్రాన్సఫర్ చేయించుకుని? మేం అనుభవిస్తున్నది చాలదా?' అనేసింది! ఏమిటో ఆవిడ భయం! "అత్తగార్ని, మామగార్ని పిల్చుకెళ్ళటానికి వచ్చాం.... ఇక ఈ ప్రాంతంలో వుండాలనే వచ్చాం!" అని ఘాటుగా జవాబిచ్చేసరికి నోరు మూసుకుంది! పాపం! ఈ కుళ్ళు రకాలతో అత్తగారూ! మామగారూ! ఎలా వేగుతున్నారో ఇన్నేళ్ళుగా! సాయంత్రం వాళ్ళని పిల్చుకుని వెళ్ళిపోదాం!" అంది రుసరుసలాడుతూ.

మూర్తికి కూడా అదే మంచిదనిపించింది....మూర్తి మాలతిల వెంటరావటానికి పెద్దవాళ్ళిద్దరూ క్షణంలో సిద్ధపడ్డారు!

"పాపం! మా అమ్మా, నాన్నా ఏదో నరకంలో నుంచి బయట పడినట్లూ, స్వర్గంలోకి వచ్చినట్లూ ఫీలౌతున్నారు మాలతీ!" అన్నాడు మూర్తి.

"అవును సుమండీ!" అంది మాలతి గొప్పగా!

"నీలా శుచిగా, శుభ్రంగా, మడిగట్టుకుని....మాకు ఒక్కరోజైనా వండి వార్చిందా శారద? ఏనాడో దానికి పిల్లలు పుట్టకముందు తప్పిస్తే! నీకూ లేరూ పిల్లలు!" అంటున్న అత్తగారి మాటలతో పొంగిపోయింది మాలతి.

"ఒక్కరోజయినా ఇలా ఆప్యాయంగా దగ్గర కూర్చొని ఆఫీసు కబుర్లూ అవీ, ఇవీ చెప్పాడుటరా మీ అన్నయ్యా! అస్తమానూ పెళ్లాం కొంగుచ్చుక తిరగటమే నాయె!" అంటున్న తండ్రి మాటలతో.. తన జన్మ ధన్యమైందనీ....తను నిజంగా తలిదండ్రుల ఋణం తీర్చుకోగలిగే గొప్ప పనిచేస్తున్నాననీ అనిపించింది మూర్తికి.

సంక్రాంతి రాబోతోందనగా....పిల్ల

లకూ, మాలతికీ, తనకూ బట్టలు కొను క్కోటానికి షాపింగ్‌కు బయల్దేరారు ...

"లలిత కూడా వస్తానందిరా మధ్యాహ్నం!...." అంది తల్లి వెనకనుంచి.

"రానీ అమ్మా! అందరం కలిసే వెడదాం!" అన్నారిద్దరూ.

లలితతో షాపింగ్‌కు వెళ్ళి-లలితకూ, గోపాలానికీ, వాళ్ళ పిల్లలకూ కూడా బట్టలు తీసుకున్నారు. లలిత తన బిల్లు చెల్లిస్తానంది. మూర్తి, మాలతి ఇద్దరూ కోప్పడ్డారు వద్దని.

"ఎంత మంచి బట్టలు కొన్నావురా మూర్తీ చెల్లెలికీ, దాని పిల్లలకూ .. ఏ ఒక్కనాడేనా ఇలాంటి బట్టలు పెట్టటానికి నా ఆడపిల్లలకు-మీ వదిన మనసొప్పిందీ? ఎంతైనా నీ భార్య గుణమే వేరు!" అంది తల్లి.

"బ్యాంకి అకౌంటు నుంచి, ఈ నెలలో అదనంగా ఓ వంద రూపాయలు 'డ్రా' చేస్తే చేసేం కానీ.. .ఇంతటి ఆత్మ సంతృప్తి ఎప్పుడేనా అనుభవించేమా మాలతీ!" అన్నాడు మూర్తి ఆ రోజు.

"నిజం!" అంది మాలతి తృప్తిగా.

"పండగకు శకుంతలనుకూడా రమ్మని రాయరా మూర్తీ! అందరం పండగ జరుపుకుందాం!" అంది తల్లి.

"తప్పకుండా అమ్మా!" అన్నాడు మూర్తి - అప్పటికప్పుడే కవరు వ్రాసి పోస్ట్‌కు పంపిస్తూ.

ఆ పండగెంతో సరదాగా గడిచి పోయింది....

"మరో రెండు వందలేగా బ్యాంకి నుంచి తీశాం! పై నెలలో జమ వేసే ద్దాంలే....పండగా....మన వాళ్ళూ . పై నెలలో వస్తారా ఏమిటీ!" అనుకున్నారిద్దరూ ఆనందంగా.

---

## చావూ - బ్రతుకూ

డాక్టరు వైద్యరామయ్యర్ గారు అయిదో పెగ్గు పూర్తిచేసి మేడమీదికి వెళ్ళబోతూ పనిమినిషిని పిల్చి ఈ క్రింది ఇన్‌స్ట్రక్షన్స్ ఇచ్చేరు:

'చూడు అప్పలమ్మా, నే నిప్పుడు మేడమీదికి వెళ్లి రెస్ట్ తీసుకుంటాను, హరి హర బ్రహ్మాదు లొచ్చినా నన్ను నిద్రలేపకు. మరీ పెద్ద చావు బ్రతుకుల మధ్య వున్న వాళ్లయితే మాత్రం లేపు.'

అయితే, అయిదు నిమిషాలకే మళ్లీ అప్పలమ్మ వొచ్చి "చావు బతుకుల బాధలో యెవరో వచ్చారండి' అంది. డాక్టర్ గారు విసుక్కుంటూ మేడిదిగి కింద హాల్లో కూర్చున్న ఇన్సూరెన్స్ ఏజెంటుని చూసి విస్తుపోయేరు.

* * * *

కోర్టు పని కోసం వచ్చే చిన్నాన్నలూ, పెళ్ళి మనువుల కోసం వచ్చే మేనమామ కొడుకులూ, ఇళ్ళ స్థలాలేవో కొనటానికి వచ్చే పెత్తల్లీ, రాఘవ, నాటకాలకు సంబంధించిన పనిమీద వచ్చే బావ మరిదులూ, వారానికోసారి పొలం పని కోసం వచ్చే పెద్దబావ.... అంతా మాలతి ఓర్పునూ, నేర్పునూ శ్లాఘిస్తున్నారు ... మూర్తి బంధుప్రేమనూ, లోభత్వం తెలీని మంచి గుణాన్ని కీర్తిస్తున్నారు. మాలతి చేసే మధ్యప్రదేశ్‌లో నేర్చుకొన్న కొత్త రకం పిండి వంటల్ని-మెచ్చుకు మెచ్చుక మరీ తిని-తిని, పట్టించుక వెళ్తున్నారు. బైదిబై మురళీ, శారదల పిసనారితనాన్నీ, బంధుద్వేషాన్నీ, కుళ్ళు గుణాన్నీ, కారిన్యాన్నీ రకరకాలుగా వ్యాఖ్యానిస్తున్నారు. ఏ రోజు చూచినా ఇల్లు పెళ్ళిలా కళకళ లాడుతోంది! బంధువులకూ, వారి ప్రీతికీ మొహం వాచివున్న మూర్తి, మాలతిలకు పండులా వుంది!

“మా పుట్టిల్లు ఇలాగే వుండేదిరా! ఎత్తే విస్తరి-వేసే విస్తరీ.... ఆ కళ వుట్టి పడుతోందిప్పుడు!” అందో రోజు తల్లి.

ఆ మెప్పుదల బావుంది గానీ.... ఆమె పుట్టిల్లు నేల మట్టమై పోయి, అప్పులతో ఆస్తంతా చితికి పోయి. అది గుర్తుకు వచ్చి ఆ ఉదాహరణ చివుక్కుమని పించింది మూర్తికి. ఎలాగో సంబాళించు కున్నాడు.




ఆరు నెలలు ఆరు రోజులుగా గడిచి పోయాయి.... ఈ ఆరు నెలల్లో ఇటుకేసి రానిదల్లా మురళీ, శారదలు మాత్రమే! ఆహ్వానించినా-ఏదో ఓ సాకు వ్రాస్తారే తప్ప రాలేదు....

“మనల్ని అందరూ పొగడటం - సహించలేకపోతున్నారేమో మీ అన్నయ్యా మీ వదిన.... అంచేతే ఇటుకేసి రావటానికి మొహం చెల్లలేదు వాళ్ళకు. తమ తప్పేమిటో - తమకే తెలిసి వచ్చుంటుంది!” అంది మాలతి.

“అవును!” అన్నాడు మూర్తి.

రెండవ ఆరు నెలలు ప్రారంభ మయ్యాయి ...

ఈ మధ్య మాలతి ఎందుకో కొంచెం చిక్కిపోయింది. మూర్తిలో కూడా కొద్ది కొద్దిగా అలసట చోటు చేసుకొంటోంది.

ఆరోజు సాయంత్రం. ..ఆఫీసునుంచి ఇంటికి రాగానే ..."కబుర్లేమిటిరా?...." అంటూ పలకరించాడు తండ్రి. ఆయన గారికి రోజూ కబుర్లు సృష్టించి చెప్పా లంటే విసుగనిపిస్తోంది మూర్తికీ మధ్య ...అందులోనూ ఆఫీసు నుంచి రాగానే, ఆ అలసటైనా తీరకుండా, నిల వేస్తారు ...

"కబుర్లేం లేవు నాన్నా!" విసుగుదల పైకి పొంగకుండా జాగ్రత్త పడుతూ లోపలికి వచ్చాడు మూర్తి.

హాల్లో కూర్చుని వున్న తల్లి రోజూలా "రా! రా మూర్తీ! .. మాలతీ! అబ్బా యొచ్చాడు. కాఫీ పట్రా!" అంటూ ఆప్యాయంగా పలకరించలేదు సరికదా, చూడనట్లు, మొహం తిప్పుకుంది.... మాలతి కూడా అంతటి ముభావంగానూ కాఫీ తెచ్చిచ్చింది.

"ఏమిటి మాలతీ అలా ఉన్నావ్?" అన్నాడు మూర్తి మెల్లగా.

"ఇంకెలా వుంటాను.... ఈ చాకిరీతో నా ప్రాణాలు పోయేలా వున్నాయి!" అంది విసురుగా.

"ఈ రోజెవరొచ్చారు బంధువులు?" భయంగా ఇల్లు నలుమూలలా పరిశీలిస్తూ అన్నాడు మూర్తి. గ్వాలియర్‌లో వుండగా నెలా-నెలా విధిగా బ్యాంకిలో వేస్తుండిన డబ్బు కాస్తా అయిపోయి నెల దాటింది! ఈ మధ్య మూడు వందలు అప్పు కూడా అయింది!

"రానిదెప్పుడు? లేనిదెప్పుడు? .." విసుగ్గా అంది మాలతి.

"అసలేమిటి గొడవ?" మూర్తి కూడా చిరాకుగా వుంది.

"ఏం చెప్పను? మొన్న సాయంత్రమే కాదూ, ఆరురూపాయలు పెట్టి వాక్‌లెట్స్ తెచ్చారు మీరు? ఈ పూట పాప నూరాం చేస్తుంటే-పెడదామంటే ఒక్కటి లేదు. అదొకటే ఏడుపు ఆపకుండా! దానికి తోడీ మడి వ్యవహారం ఒకటి ...పిల్లలను అస్తమానూ దూరంగా వుంచాలి. వాళ్ళు అవి ముట్టుకున్నారూ-ఇవి ముట్టుకున్నారూ అని మీ అమ్మగారొకటే గొడవ! నేనేమో అస్తమానం చింపిచేరులా-ఈ మడిబట్టతో పస్తులతో " ఇక ఓపికలేని మాలతికి కళ్ళ నిండుగా నీళ్ళు వచ్చేశాయి,

తల్లి ఒక్కసారిగా విరుచుక పడింది. "లలిత, దాని పిల్లలూ వస్తున్నారనేగా దాని బాధ? ఎల్లకాలం వాళ్ళేదో ఇక్కడ పడి తింటారని భయం! వాళ్ళేం గతి మాలిన వాళ్ళు కారు....ఏదో సువ్వున్నా వని వస్తోందది! వచ్చీ పోయీ పెద్దకోడలి గుణాలు అరువు తెచ్చుకొంటోందీవడ!',

మూఢునిలా బాత్‌రూంకేసి పరుగెత్తాడు మూర్తి. అతగాడి తల గిరగిర తిరిగి పోతోంది.

ఇంటి ఖర్చు అదుపు తప్పిపోయింది! మాలతి చెప్పిన దాన్లో అబద్ధమేమీ లేదు, సాధారణంగా సాయంత్రం వేళల పిల్ల

లతో బయల్దేరి వచ్చే లలిత-అమ్మతో, మాలతితో కబుర్లు చెబుతూ కూర్చుంటుంది. ఈలోగా భార్యకోసం గోపాలమూ వస్తాడు. చీకటి పడుతుంది కబుర్లలో.— పిల్లలు "ఆకళ్లో!" అంటూంటారు. పిల్లలందరికీ అన్నాలు పెడుతుంది మాలతి.

"పోనీ ఇప్పుడింటికి వెళ్ళకపోతే ఏమే లలితా! మీరిద్దరూ ఇక్కడే భోం చేయరాదూ! మీ వదినె ములక్కాడలకూర చాలా చక్కగా చేస్తుంది. ఈ పూట చేపిందది ..."

"అవునే లలితా!" అనేవాడు తను ప్రేమగా —తర్వాత తర్వాత మొహమాటంగా.

ఒక్కో రోజు.. మాలతి ఇక తిరిగీ వండుకొనే ఓపిక లేక-ఉన్నదేదో వేసుక తినటం, లేవా ఓ గ్లాసు మజ్జిగ తాగి "నాకేమిటో కడుపులో నొప్పిగా వుంది ... ఆకలి గాలేదు!" అంటూ వుసూరుమని పడుకోవటం తనకు తెలియంది కాదు.

నెలా నెలా పిల్లల ముగ్గురి పేరిటా తలకో పది రూపాయలు సేవింగ్స్ అకౌంటులో వేసేవాడు తను! పండగ పండగకూ పిల్లలకూ, మాలతికీ బట్టలు తీసుకొనే వాడు....

ఇప్పుడేమీ లేదు....అప్పు అయింది! పోనీ తీర్చుకోవచ్చు కాపీ అమ్మ చాదస్తంతో, అతి మడితో, అస్తమానం చాకిరీతో....మాలతి ఎలా తయారై పోతోంది? వంటలక్కలా....వళ్లు కాదులా ఏకాంతం దొరకటం లేదు. అస్తమానం రైల్వే ప్లాట్‌ఫారమ్‌లా వుంటోంది ఇల్లు!

బంధువులంతా-వేటపాలెం జీడిపప్పు పరిశ్రమను తన ద్వారా ఉద్ధరింప జేస్తున్నారు! "డబ్బు పోస్టులో పంపుతా"మనే స్కీమ్‌లో జాంద్రపేటలోని అద్దకపు పరిశ్రమను తన ద్వారా విస్తృత పరుస్తున్నారు! వాడరేవులో సముద్ర స్నానాలతో వాళ్ళతో బాటు తనకూ 'పుణ్యం' తప్పటం లేదు. వెళ్తూ-వెళ్తూ "మీ అన్నా నువ్వూ, ఒక తల్లి పిల్లలయినా....వాడి గుణం వేరు-నీ గుణం వేరు .." అనే



కాంప్లిమెంట్స్ మాత్రం దండిగా డబ్బు లకు బదులుగా ఇచ్చి వెడుతున్నారు!

రేపు అక్క శకుంతల, దాని పిల్లలు వస్తారుట... దానికేదో ఈమధ్య గుండెల్లో నొప్పిగా వుంటోందట. ఓ నెల రోజు లుండి మందు తీసుకుంటుందట ఇక్కడ. అమ్మ జాబు వ్రాయించింది.

ఏమిటీ పద్మవ్యూహం ...? ఎక్క డుంది దారి? అసలు తను ఎక్కడ దారి తప్పాడు?

"మీ స్నానం ఇంకా కాలేదా? మీ రాఘవ వచ్చాడు!" బాత్ రూం బయట నిల్చుని పిలుస్తున్న మాలతి పిలుపుతో బయట పడ్డాడు మూర్తి.

రెండు నెలలు తిరిగేసరికి - మూర్తికి ఏదో మైకం మెల్లిగా మంచు తెరలా విడి పోవటం మొదలెట్టింది.

వారం రోజులుగా జ్వరం వస్తోంది. తగ్గలేదు... డాక్టర్‌కు చూపిస్తే టైఫాయిడ్ అనీ, హాస్పిటల్‌లో చేరటం మంచిదనీ, ఇంట్లో ఈ రద్దీలో విశ్రాంతి వుండదనీ చెప్పాను.

ఇంటి నిండా మనుషులు? తలకు మించినమమతలు ..సంపాదనకు మించిన ఖర్చు వెర్రి వెధవల్లా తయారయిన పిల్లలు....తనకీ జబ్బు....బంధుత్వాల మధ్య ఇంతటి ఆర్థిక శాస్త్రం, ఇన్ని రాజ కీయాలూ, ఎన్ని సమస్యలూ వుంటా యనీ....ఏ యూనివర్సిటీలూ, ఎన్ని డిగ్రీలూ తెలియజేయలేవు

టెంపరేచర్ కాస్త తగ్గిన కాస్సేపూ ఆలోచనలతో బుర్ర పగిలి పోతోంది మూర్తికి. తిరిగి టెంపరేచర్ రెయిజ్ అవుతోంది!

డాక్టర్ రాజారావు ఆశ్చర్యంగా చూశాడు మూర్తి వేపు.

''ఇదేమిటి మూర్తీ! నా మందుల దారి మందుదీ, మీ జబ్బు దారి మీదీ అయింది! బహుశా మీకేదో "వర్రీ" కూడా వుందల్లే వుంది...ప్లీజ్ నాతో చెప్పదగినదయితే చెప్పండి....'' స్నేహపూర్వకంగా అతగా డలా అడుగుతుంటే. మూర్తికి - రామ్ చరణ్, ఛటర్జి, నరేంద్ర, సబిత, ఫతిమా అంతా గుర్తొచ్చారొక్కసారిగా. ఇలాగే

---

● ''పడితే పడ్డారు కాని హాస్పటల్ ముందు పడ్డారు.'' అన్నాడో పల్లెటూరి దానయ్య రోడ్డుమీద పడ్డ అసామితో.

''నన్నింకెన్ని సార్లు ఆపరేషన్ జేయించుకోమన్నావయ్యా!" మసరుసలాడుతూ వెళ్ళిపోయాడా అసామీ. అది ఫేమిలీ ప్లానింగ్ హాస్పిటల్ అని తెలియని పల్లెటూరి దానయ్య తెల్లబోయాడు.

— వెలిచేటి శ్రీనివాసరావు, కాకినాడ.



తనోసారి జబ్బున పడితే-వంతుల వారీగా హాస్పిటల్‌లో తన ప్రక్కన వుండేవారు సేవలు చేస్తూ. మాలతికి కాన్పు అయి ఆమె హాస్పిటల్‌లో వుంటే-తన కోసం, పిల్లల కోసం కారియర్ పంపేవారు.... పొట్ట చేతబట్టుక వెళ్ళిన తనకు-తనలానే వచ్చిన వాళ్ళందరూ అండదండలిచ్చారు. పరస్పరం అప్పులు పుచ్చుకున్నారు. తీర్చుకున్నారు ఆపదల్లో ఆదుకున్నారు. సరదాగా వాదులాడుకున్నారు. ఎవరి హద్దులలో వారు....ఎవరి జీతా-లో-జీవితాలలో వారు ఇమిడిపోయారు. స్నేహాన్ని అపురూపంగా వాడుకున్నారు. కాని ఈనాడు జరుగుతున్నదేమిటి?

"ఏమిటి మూర్తీ మీ సమస్య? ... చెప్పండి-నాచేతనైన సాయం చేస్తాను." డాక్టర్ రాజారావ్ తిరిగి హెచ్చరింతటంతో మూర్తికి ఒక్కసారిగా లోపలున్న లావా లాటి బాధ పైకి పొంగింది.... అంతా విన్న రాజారావు నిట్టూర్చాడు.

"వాటెపిటీ! మీరు చెప్పిన విషయాలలో చాలా భాగం నాకూ అనుభవానికొచ్చినవే మూర్తీ! మాది తూర్పుగోదావరి జిల్లా....కోరి కోరి ఇంత దూరం వచ్చి ఇక్కడ ప్రాక్టీస్ పెట్టానంటే. ఎంతగా ఈ బంధుప్రేమలతో హడలి పోయానో మీరే ఊహించుకోండి! అందరి మధ్యా

పుండగా—అందరికీ అన్ని సాయాలు చేశాను. డబ్బు ఖర్చు పెట్టాను. ఏం లాభం! ఏ ఒక్కరికీ తృప్తి కలిగించలేక పోయాను: నా క్షేమం, నా సంతోషం కోరే వారు నా కొక్కరూ కనిపించలేదు నా బంధువులలో! నా దగ్గర డబ్బు, నా సేవ. అవసరమైతే నా తోలు కూడా వలిచి.. రక్తమాంసాలు పంచుక, తీసుక, దోచుక పోదామనే వారి వుద్దేశ్యం! తల్లి లేదు. చెల్లి లేదు.. అంతా ఒకటే స్వార్థం! తమకు-నన్ను ఎన్ని విధాలుగా ఉపయోగించుకోవాలా అన్నీ ధ్యాసే!....మీరు విన్నారో లేదో-కబీర్‌దాస్ దోహా ఒక టుంది దాని అర్థం "చందనం వృక్షాలు ఎప్పుడూ అంకుబాటులో వున్న భిల్లు (కొండజాతి) వనిత వాటిని వంట చెరకుగా వుపయోగిస్తుందిట!" అంతే మరి-మీరు చిరాకునణచుకున్నంత కాలం! మీ ఆవిడ నోరెత్తనంత కాలం! మీ బంధువులంతా మిమ్మల్ని దేవుడనే అంటారు. అది లేని మరుక్షణం - మీరు దెయ్యంగా మారి తీరుతారు! దెయ్యంగా నేనిక్కడకు వచ్చాను ఈ రోజా మారాన వున్నానా? ఏ బంధువుకో జబ్బో, పెళ్ళో, మరో ఆపదో వస్తే....ఇక్కణ్ణుంచే ఓ పాతికో, పరకో పంపి చేతులు దులుపు కుంటాను....ఇక నేనెలాగూ అందను కాబట్టి. నా డబ్బులో కొంతేనా అందు తోంది కాబట్టి "అబ్బో! మీవాడు మంచి వాడు!" అంటున్నారు....అనకుంటే అదీ పంపనేమోనని భయంతో మాత్రమే!

సర్లెండి-ఏదో చెప్పకు పోతున్నాను. మీరూ, మీ శ్రీమతీ కాస్త మొగమాటాలు తగ్గించుకోండి! 'కీర్తి కండూతికి లోబడ కండి! అదొక్కటే ప్రస్తుత పరిస్థితుల్లో నుంచి మిమ్మల్ని, కొంతవరకేనా రక్షించ గల ఆయుధం ...మరి వస్తా!"

రాజారావు లేచి వెళ్ళిపోయాడు!... హితోపదేశం పూర్తయ్యాక, అర్జునుడికి రణరంగం స్పష్టంగా కనిపించినట్లు.... అందాకా తననావరించుకుని వున్న మబ్బు తెర ఏదో తొలగిపోయినట్లైంది మూర్తికి! సాయంత్రం మాలతి దగ్గరకు వచ్చి— భోరున ఏడ్చింది.

"మీకీ జబ్బు రావటం.. నే చేసిన పాప ఫలితమట! ఆ పాపమేమిటో తెలుసా? ఆడబడుచులకు సరిగా మర్యాదలు జరపటం లేదట! అత్తగారి విషయంలో నిర్లక్ష్యం చూపుతున్నానట! అసలు మీకిక జబ్బు తగ్గదట! అప్పుడుగానీ నా పొగరు అణగదట." తీరి కూర్చుని - విశ్రాంతులూ, భోజనాలూ జరుపుకుంటూ బంధువు లంతా విసురుతున్న వాగ్బాణాలవి!.... ఎంతటి విషం! వీళ్ళ కంటే పాములూ, పులులూ, సింహాలూ నయం కాదూ?.... వాటికి నయవంచన చేతకాదు!!

"....మూర్తీ!' వల్లవి చేతి స్పర్శ నుదుటిమీద పడింది.

ఉలిక్కి పడినట్లు కళ్ళు తెరచి చూశాడు

మూర్తి. మురళీ, అతగాడి వెనకాలే శారద నిల్చొని వున్నారు బెడ్ దగ్గరగా.

''అన్నయ్యా! ..'' ఆశ్చర్యంగా చూశాడు మూర్తి. చీకటి తెరలు పటాపంచలై పోయాయి. కొత్తగా జ్ఞానజ్యోతి లాటిదేదో హృదయంలో వెలిగినట్లైంది మూర్తికి.

''అవున్రా మూర్తీ! నువ్వు జబ్బుపడ్డావని తెలిసి...ఇంతకు ముందుగానే వచ్చాం నేనూ, మీ వదినా!'' మురళీ మూర్తి బెడ్ మీద కూర్చుంటూ అన్నాడు.

రాయిలా మారిన అన్నయ్య, గయ్యాళిగా బిరుదు వహించిన వదిన—అందుకొచ్చారనుకొనేరు? ఇన్నేళ్ళుగా-వీళ్ళందరి మధ్యా వుండి ఇక ఎక్కడికీ వెళ్లే అవకాశం లేని అన్నయ్య—దేవుడిలాటి అన్నయ్య... నిజమే! దేవుడిలానే శిలలా మారిపోయాడు. ఏ అనుభూతులూ, ప్రేమలూ లేని కఠిన పాషాణంలా మారిపోయాడు. వదిన ఆడది. ఆత్మనిగ్రహం అస్సలే లేని సహజ స్వభావంతో నోరు పెంచుకొంది. రాక్షసిగా మారిపోయింది.

''ఏమిట్రా మూర్తీ! కొత్త వాళ్ళను చూచినట్లు చూస్తున్నావ్'' మురళీ అడుగుతున్నారు.

''ఏం లేదన్నయ్యా! మేమీ ప్రాంతానికి రాగానే—నువ్వు, వదిన మాతో ఏమన్నారో గుర్తుకు వచ్చిందంతే! అందులోని సందేశం మాకు బోధ పడేసరికి - చాలా



రోజులు పట్టింది.'' నిట్టూర్చాడు మూర్తి.

''సర్లే! అవన్నీ ఇప్పుడెందుకు ఇంకా ఎన్నాళ్ళుండాలి హాస్పిటల్లో?''

''ఏమో..'' పేలవంగా నవ్వాడు మూర్తి.

''సరే..డాక్టరుగారి నడుగుతాలే. రేపొద్దున నేనూ, మీ వదినా వెళ్ళాలి.''

''అదేం? నాలుగు రోజులుండరూ!''

''ఇంకా నీ బంధుప్రేమ తగ్గలేదూ!'' ఊహూఁ! నాకు పొలం పనులున్నాయి. నా వెంట అమ్మనూ, నాన్ననూ పిల్చుకెళతాను! లలితకు గట్టిగా చెప్పాను. మాలతికి ఆరోగ్యం బాగా లేదనీ, అంచేత తరచు ఆమెకు పని కల్పించి—ఆమెను చికాకు కలిగించవద్దనీ, శకుంతలక్కయ్యా బావలు వేరే ఇల్లు చూచుకుంటారనీ లేపు....రాఘవ, మిగతా బంధువర్గానికంతా

హోటళ్ళవారులు చెప్పే వచ్చాను. నువ్వు కాస్త కోలుకున్నాక, మాలతి కూడా మంచి మందులిప్పించే ఏర్పాటు చూడు. ఇంతకంటే నేనేం సాయం చేయలేను. ఆ మాట చెప్పి వెళదామనే వచ్చాను.... ఎవరి హద్దులలో వాళ్ళనుంచిన నేనూ, మీ వదినా పెద్దవాళ్ళం కానే అయ్యాం ఏ నాడో: ...నువ్వయినా సుఖంగా వుంటే అంతే చాలు....మరి వెళ్ళొస్తా!''

మురళి, శారద వెళ్ళిపోయారు ... మూర్తి అప్పటికప్పుడే ఉత్తరం ఒకటి వ్రాసి, అటుగా వచ్చిన సిస్టర్ చేతికిచ్చాడు పోస్టు చేయించమని. అతగాడికో కొత్త శక్తికో వచ్చినట్లయ్యింది....

* * *

నెల రోజుల తర్వాత—

ట్రెయిన్‌లో తిరిగీ గ్వాలియర్‌కు వెళ్తున్న మూర్తి, మాలతిల మనస్సులు- ఏదో ''గని''లో నుంచి బయట పడ్డంత తేలిగ్గా వున్నాయి....

''మీరు ఉత్తరం వ్రాయగానే-పాపం మీ స్నేహితులంతా మీ మేనేజరుగారికి నచ్చచెప్పి, మనలను తిరిగి అక్కడకు వెళ్ళగలిగే ఏర్పాటు చేయబట్టి సరిపోయింది....ఇక అక్కడే వుండిపోదాం: ఏమంటారు?....'' అంది మాలతి. ఆమె నవ్వుతుంటే పళ్ళూ, కళ్ళూ వెలికి వస్తున్నాయి!

''అవును-మన బంధువులు అక్కడే వున్నారు .'' క్షణకాలం ఆగి, హఠాత్తుగా ఏదో గుర్తుకు వచ్చిన వాడిలా అన్నాడు మూర్తి.

''నువ్వు దైవోపహతులు ...ప్రేమోపహతులు....లాటి మాటలు విన్నావు కదూ మాలతీ!''

''విన్నాను ...ఏవో కథల్లో చదివాను కూడా!'' అంది మాలతి.

''అలాగే ...మనలాటివారికో చక్కటి పేరు పెట్టొచ్చు. 'బంధోపహతులు.... రాబందోపహతులు' అని కదూ....అదేం సమాసమో-సంధేమిటో - అసలా పదాలు అలా అనవచ్చో, అనకూడదో నాకనవసరం....పేరు మాత్రం బ్రహ్మాండంగా వుంది....అవునా? 'బంధోపహతులు'!'' వెర్రిగా నవ్వుతున్నాడు మూర్తి.

---

● తండ్రి :—ఒరే నువ్వు సరిగ్గా చదివి బాగుపడరా! లేకపోతే పైకి రాలేవు.

కొడుకు :—ఇప్పటికే మూడవ అంతస్థులో ఉంటే ఇంకా పైకెందుకు నాన్నా!

—ఎం. నాగమణి, కాకినాడ.

# తలభాష

—దువ్వూరి సుబ్రహ్మణ్యం.

మానవుడు కేవలం నోటితోనే మాట్లాడతాడంటే యిందులో అతిశయోక్తి లేదు. మనిషి తన భావాలని వ్యక్తం చెయ్యడానికి తన తలకాయనంతా ఉపయోగించడం మనం చూస్తూనే ఉన్నాం. "అవును" అనడానికి బదులుగా కొంచెం మందంగా అటూ ఇటూ తల ఊపుతాడు. అట్లాగే "కాదు" లేక "వద్దు" అనడానికి చరచరా తిర్యగ్చాలనం చేస్తాడు. ఎవరేనా గొప్పవారి దర్శనానికి వెళ్ళేమనుకోండి. ముందుగా "లోపలికి రావచ్చా?" అని ప్రశ్నిస్తాం. ఆ గదిలో వ్యక్తి తన హోదా అంతా ఉట్టిపడేటట్లు శిరశ్చాలనం చేస్తాడు. రమ్మనడానికి ఒక విధంగా తల వూపితే పొమ్మనడానికి మరొక విధంగా తలకాయాడిస్తాడు. ఒక్కపెట్టున ముఖం పక్కకు విసరినట్లు తల వూపితే అక్కడ నిల్చున్న మానవుడు వెంటనే తొలగిపోవాలని అర్థం.

ఎవరికేనా ఏదో వృత్తాంతం చెప్తున్నామనుకోండి. కొందరు "ఊఁ" కొట్టుతూ వింటారు. మరికొందరు తల వూపడమే "ఊఁ" అనే అర్థంలో చేస్తారు. ఎవరేనా గొప్పవారి వద్ద మన కష్టాలు వెళ్ళబోసుకుంటున్నామనుకోండి. శ్రద్ధగా వింటున్నంతసేపూ వాళ్ళ బుర్ర యంత్రంలాగ కిందికి వాలుతూ లేస్తూ ఉంటుంది.

ఉదాహరణకి సంగీత పాటకులని గమనిద్దాం. పాటలో ఉన్న లోపాలని తల ఊపడంతో నింపుకుంటారు. మద్దెల వాయించే వాళ్ళ తలకాయలు చూస్తూ ఉంటే నిజంగా నృత్యం చూసినంత ఆనందంగా ఉంటుంది. ఆ సంగీతాన్ని మెచ్చుకున్నట్లు తెలియజెయ్యడానికి, సభలో కాస్త సంగీత జ్ఞానం ఉన్నవాళ్ళంతా తల లూపుతూనే ఉంటారు. రాగం, తాళం తెలియనివాళ్ళు కూడా తలలూపడం కద్దు. గాయకుడు తల ఊపే విధానానికీ, ప్రేక్షకులు తల ఊపే విధానానికీ సన్నిహిత సంబంధం కనబడుతుంది.

ఈ తల సంజ్ఞలని మాటలను బలపరచడానికి సాధారణంగా వినియోగిస్తారు. కాని సమయానుకూలంగా కేవలం శిరస్పంజ్ఞల తోనే భావాలను వ్యక్తం చేయడం పరిపాటి. అప్పుడే సంజ్ఞలు పరిపూర్ణమైన స్వతంత్ర భాషగా పరిణమిస్తాయి. భావ

అని స్పష్టం చెయ్యడంలో ఒక్కొక్క పుడు జిహ్వేంద్రియం కంటె, ప్రధానాంగం ఎక్కువగా పనిచేస్తుంది. అయితే నాలుకకున్న అధికారాన్ని దోచుకోవాలని కాదు బుర్రలో ఉద్దేశం. రెండూ మానవ శరీరంలో భాగాలే కనుక ఒకదాని కొకటి మద్దత్తునివ్వడం భగవంతుడు చేసిన ఏర్పాటేమో?

ఈ నిశ్శబ్ద భాష ఆంధ్ర దేశంలోనే కాక, అఖిల భారతంలో వ్యవహరింపబడుతున్నది. ఒకే భాష అయినప్పటికీ తెలుగు భాష వేరు వేరు ప్రాంతాల్లో వేరు వేరు రీతులలో మాటలాడ బడ్డట్లే, ఈ తల భాష కూడా, అఖిల భారత స్థాయికి చెందినప్పటికీ, వేరు వేరు రాష్ట్రాలలో చిన్న చిన్న భేదాలతో వ్యవహరింపబడుతూ వస్తున్నది.

కొన్నినాళ్ళ వెనుక, మరో రాష్ట్రానికి చెందిన నలుగురు వ్యక్తులు పనిమీద మా ఊరు వచ్చేరు. మధ్యాహ్నం భోజనాలవేళ హోటలుకి వెళ్ళేరట, భాష రాకపోవడం వలన చేత్తో మూతి చూపిస్తూ "భోజనం" అని అడిగేరట. పాపం, పది పన్నెండు హోటళ్ళలో అడిగేరు కాని భోజనం లభించలేదు. వాళ్ళలో ఒకరితో నాకు కాస్త పరిచయం. నన్ను రోడ్డు మీద కలియగానే జరిగిన వృత్తాంతం ఇంగ్లీషులో చెప్పేరు. మా వూరు హోటళ్ళలో భోజనం లేదన్నారంటే నాకు ఆశ్చర్యం వేసింది. నేను వాళ్ళని తీసుకవెళ్ళి భోగట్టా చెయ్యగా నిజం తెలిసింది. హోటలువాళ్లు భోజనం ఉన్నదనే తల ఊపేరట. వీళ్లా తల వూపుకి "లేదు" అనే అర్థం అనుకున్నారు.

"ఈ తల భాషలో ఇంత చిన్న విభేదం ఎంత విషమ పరిస్థితి తెచ్చిందో" అన్నా డొకాయన, "ఈ శిరస్సంజ్ఞలని దేశమంతటా ఒకే రీతిని సరిదిద్దుకోవడం ముఖ్యావసర ' ఉన్నాడింకొకడు. "లేకపోతే అంతర్రాష్ట్రీయ వ్యవహారాలకి అడ్డంకులు వస్తాయ"న్నారు. ఈ విషయంలో ఆందోళన లేవతీయాలన్నారు ఔనన్నానా. బుర్రూపేను.

---

● మినిష్టరుగారి అబ్బాయి :—నాన్నా! పదో తరగతి చాలా కష్టంగా ఉంది పేపర్లు సంపాదించి పెట్టవూ?

మినిష్టరుగారు :—వెధవాయి, పేపర్లేం ఖర్మరా! నువ్వు పరీక్షలకు కూర్చో! పాస చేయించే బాధ్యత నాది.

—కె. రవీంద్రప్రసాద్, అంగలకుదురు.



# రేవునావ మరకాడు

బెంగాలీ మూలం
శ్రీ సతోకాంత్ గుహ

అనువాదం: [illegible]

విక్టోరియా మహారాణి కాలంలో లక్ష్మీనాథుడనే మరకాడు ఉండేవాడు. అర్ధరాత్రి రెండుఝాములు మినహాయించి మిగతా అన్ని సమయాల్లోనూ తన నల్లపడవలో ప్రయాణీకుల్ని ఈ ఒడ్డు నుంచి ఆ ఒడ్డుకి, ఆ ఒడ్డు నుంచి ఈ ఒడ్డుకి చేరుస్తూ ఉండేవాడు ఏళ్ళ తరబడి వాడిదే పనిచేస్తున్నాడు.

ఇచ్ఛాపురం రేవు చాలా చిత్రమైంది. నది పేరు భానుమతి. భానుమతికి ఇంద్రజాల మహేంద్రజాల విద్యలు తెలుసు. పద్మా నదిలా ఒడ్డుల్ని కోసే తరంగాల రాపిడి లేదు. పోనీ అని మేఘనా నదికి నల్లటి నీళ్ళలా సర్వస్వం కొల్లగొట్టే దొంగదెబ్బ కొట్టదు. దామోదర్ నదిలో లాగ ఆకాశాన్ని ముంచెత్తే వరదలూ రావు. అయితేనేం భానుమతీ నదీజలాల్లో అద్భుతమైన నేర్పుఉంది. దాని అడుగున దొంగ సుడిగుండాలు గుండ్రంగా వానా వానా చెల్లప్ప తిరుగుతూ ఉంటాయి. అంతేనా: ఆకాశం పీల మేఘాలతో

అవృతమైంది. భా సు మ తి నదికూడా నీలంగా అయిపోతుంది. ఉదయం మధ్యాహ్నం, సాయంత్రం ఆకాశంతో పాటు దానిరంగు మా రి పో తూ ఉంటుంది. ఉదయంపూట ఎర్రటి ఉక్కులా మెరిసి పోతుంది. మధ్యాహ్నం తెల్లగా తళతళ్లాడుతుంది. సాయంత్రం బుక్కాగుండ పులుముకున్న ఆకాశంలా రక్తవర్ణంతో కనబడుతుంది.

లక్ష్మీనాథుడి ధ్యాస వీటి వేటివేపూ ఉండదు. రెండు తీరాలనీ తన్మయత్వంతో చూస్తాడు. సర్వకాల సర్వావస్థల

దూరంగా వాయవ్యంగా ఉన్న అఫ్ఘన్ స్థానంలో గొప్పవాళ్ళ మధ్య యుద్ధం జరుగుతోందన్న సంగతే వాడు ఎరగడు. వాడివెనక దూరంగా దక్షిణదేశంలో మరాఠా పీష్వాలు ఇంగ్లీషువారి చేతిలో చిత్తుగా ఓడిపోయేరనీ వాడికి తెలియదు. వాడికి కుడివేపూ ఎడమవేపూ దూరదూరంగా ఉన్న ప్రాంతీయ రాజ్యాల అదృష్టం మట్టిలో కలిసిపోతుందన్న విషయం వాడు ఎరగడు. టెలిగ్రాఫ్ తీగతో ఓ నిమిషంలో మనిషి కబురు వెయ్యి మైళ్ళ దూరం చేరుతోందన్న

---

ఆశలకు అంతులేనిదే జీవితం! భానుమతి నదిలాంటి అట్టడుగు సుడిగుండాలు తనకే కోత పెట్టాయి. అమాయకులైన పరోపకారుల జీవితమూ యింతే కాదా?

---

యందూ ఈ ఒడ్డునుంచి ఆ ఒడ్డుకి, ఈ ఒడ్డుకి ప్రయాణీకుల్ని చేరేస్తూ ఉండడమే వాడిజీవితం! తనదెంత సుఖమైన బ్రతుకో కదా అని పడవ నడుపుతూ అప్పుడప్పుడు వాడు అనుకుంటూ ఉంటాడు. రెండు తీరాల మధ్య పడవ నడపడంలో వాడి రోజులు ఎంతో హాయిగా గడిచి పోతున్నాయి!

వాడు చూస్తూ ఉండగా అవతల ప్రపంచం ఎంతలా మారిపోతోందో ఎంత కొత్త రూపాన్ని పొందుతోందో వాడికి తెలియనే తెలీదు. వాడు ముందు

సంగతీ తెలీదు. ఇచ్ఛాపురానికి పదికోసుల దూరంలో రైలుపట్టాలు పడ్డట్టుగాని, దాని మీద గుఱ్ఱం లాగని చిత్రాతిచిత్రమైన బండి నడుస్తోందని గాని వాడికి తెలీదు. ప్రపంచం యొపే మారిపోయిందనీ చరిత్ర సరికొత్తగా మళ్లీ రాయబడుతోందనీ ఎరగడు, ఇంకెన్నెన్నో ఇలాంటి విషయాలు అద్భుతమైనవి ఈ మరకాడికి తెలియే తెలివు.

అయితే అప్పుడప్పుడు ఈ సంగతులు కొద్దికొద్దిగా వాడిచెవినీ పడుతున్నాయి. చిత్రచిత్రమైన ప్రయాణీకుల్ని రేవు

దాటిస్తూ ఉంటాడు. వాళ్ళలో రకరకాలైన వాళ్ళు ఉంటారు. వాళ్ళు చెప్పగా ఈ కొత్త ప్రపంచపు సంగతులెన్నో విన్నాడు. వాళ్ళు చెపితేనే కలకత్తా పట్నంలో వీధులంట గొప్పగొప్ప నల్ల దొర బాబుల పెద్ద బళ్ళు, బగ్గీలూ తిరుగుతాయని వాడికి తెలిసింది. ఆ నల్ల దొరలు కాళీఘాట్‌కి పూజ చెయ్యడానికి దొంగతనంగా వెళ్తారనీ బంగాళాదేశంలో ఎన్నో పట్నాల్లో రాత్రివేళప్పుడు వీధుల్లో కిరోసిన్ దీపపు స్థంభాలు వెలుగుతాయని విన్నాడు. "ఎంత వింతో కదా! ఈ భూలోకం స్వర్గాన్ని తల దన్నుతోంది!" అనుకునేవాడు లక్ష్మీనాధుడు. ఎందుకంటే స్వర్గంలో వీధులంటే దీపాలు వెలుగుతాయని వాడు ఎప్పుడూ వినలేదు.

ఒకొక్కొక్కసారి వాడికి ఆశ పుట్టేది. సెలవు పుచ్చుకుని పట్నం చూసివద్దామని పించేది. ఆ కలకత్తా నగరపు వింతలన్నీ తొంగిచూసి వద్దామనుకునేవాడు. అయితే తన పడవవేపు చూసి గట్టిగా నిట్టూర్పు విడిచేవాడు. వాడికి సెలవేది? వాడు వెళ్ళిపోతే ఇచ్ఛాపురం రే[illegible]వ ఎవరు నడుపుతారు? ప్ర[illegible]ల్ని ఈ ఒడ్డు నుంచి ఆ ఒడ్డుకి ఎవరు చేరవేస్తారు?

"నువ్వెళ్ళి పట్నం చూసిరా. నీరేవుని నేను కనిపెట్టుకుంటాను" పక్క ఊరు పడవవాళ్ళ చిన్నోడు ఓ రోజు వాడితో అన్నాడు. కాని లక్ష్మీనాధుడికోరిక సినరికి చల్లారిపోయింది.

"అబ్బే. అదెలా కుదురుతుంది? ఈ రేవులో ప్రతి అల్లాయిటుల్లాడువాడు గడివెయ్యగలడనుకున్నావా?" బుర్ర అడ్డంగా తిప్పి లక్ష్మీనాధుడు ఎంతో గంభీరంగా అన్నాడు.

ఇల్లాగా ఎన్నో ఏళ్ళు గడిచిపోయేయి. ప్రపంచం ఏం మారలేదు. అక్కడ చరిత్ర ఆగిపోయి అలాగే ఉంది. అదే నది నదీజలాలు. అదే రేవు పడవ ప్రయాణీకుల గుంపు. ఈ ఒడ్డునుంచి ఆ ఒడ్డుకి సర్వసమయాల్లోనూ ప్రయాణీకుల్ని రేవు దాటించే లక్ష్మీనాధుడు!

ఓ రోజు ఎండ వాలిపోతోంది. ప్రయా

---

● "నాన్నా! నాకు జ్యోతిలక్ష్మి డాన్సు చూపెంచవూ?" అని అడిగాడు నాగేశ్వ కొడుకు తండ్రిని.
"ఆ డాన్సెందుకు బాబూ?" అని అడిగాడు తండ్రి.
దానికి ఆ అబ్బాయి "మరేమో జ్యోతిలక్ష్మి మో మన చెల్లాయిలా ఓ డ్రాయరు తోనే వుండి ఎంచక్క వుంటుంది ..." అన్నాడు.
తండ్రి వెల్లమొహం వేశాడు.

—కె. రవీంద్రప్రసాద్, అంగలకుదురు




ఱేవుల్లో ఓ వింతమనిషి పడవ ఎక్కేడు. నీలంరంగు బట్టలు వేసుకున్నాడు. నీలం టోపీ పెట్టుకున్నాడు. పడవ ఒడ్డు వది లింది. ఆ మనిషి లక్ష్మీనాధుడితో కబుర్ల లోకి దిగేడు.

''ఎన్నేళ్ళబట్టి గడేస్తున్నావు?''

''ఏభై ఏళ్ళ బట్టీ.''

''ఏమిటేమిటీ? ఏభై ఏళ్ళ కాలంలో నదులు ఎండిపోయి మైదానాలవుతాయి. మళ్లీ మైదానాలు నీటితో నిండి నదులవు తాయి. నువ్వు ఏభై ఎళ్ళబట్టి పడవ నడుపు తున్నావా?'' ఆ మనిషి ఎవరో గాని చిత్రంగా ఉన్నాడే! ఏభై ఏళ్ళ గడవేసి పడవ వడపడంలో అంత ముక్కుమీద వేలువేసుకోవల్సిందేముందో! అని లక్ష్మీ నాథుడు మనసులో అనుకున్నాడు.

''ఏ ఏ జిల్లాల్లో ఏ ఏ నదుల్లో పడవ నడిపేవో చెప్పు.... చెప్పూ వింటాను.

''ఎక్కడెక్కడో ఏమిటి? ఈ భాను మతీ నదిలో ఈ ఇచ్ఛాపురం రేవులోనే.''

ఆ మనిషి ఆశ్చర్యంతో అలా ఉండి పోయేడు. లక్ష్మీనాథుణ్ని నఖశిఖపర్యంతం ఎగాదిగా చూసేడు. ''ఎంత వింత! ఏభై ఏళ్ళు! ఈ భానుమతీ నదేనా! ఈ ఇచ్ఛా పురం రేవేనా?''

లక్ష్మీనాధుడుకి లోలోపల కోపం వచ్చింది. ఏం ఈ భానుమతీ జలాలు, ఈ ఇచ్ఛాపురం రేవు అంత తీసిపోయేయా? ఈ నీరు, ఈ ఆకాశం పగలూ రాత్రీ ఎన్నెన్ని రంగుల్లో కనపడతాయో ఆ మనిషికేం తెలుసు? ఈ నదీజలాల్లో

ఉండుండి ఎన్నెన్ని చిత్రవిచిత్ర జంతువులు నీటిఅడుగునుంచి తొంగిచూస్తాయో పడవనిచూసి అట్టడుక్కి మునిగిపోతాయో. ఆకాశంలో ఎన్నెన్ని రంగుల పక్షులు తెలీని దూరదేశాలనుంచి ఎ గు రు తూ వస్తాయో ఆ మనిషేం ఎరుగును? ఓరోజు ఈ రేవు కెదురుగా ఉన్న మైదానానికి ఆవల ఉన్న అడివిలోంచి ఓ లేడి వచ్చి ఈ రేవునీ, పడవనీ ఆశ్చర్యంగా చూస్తూ నిల్చున్న సంగతి ఆ మనిషికి మొదలే తెలీదు.

ఆ వింతమనిషి లక్ష్మీనాధుని కివేవీ చెప్పే అవకాశం ఇవ్వలేదు.

''ఏబై ఏళ్ళు కాదనుకో, నేను నీటిలో ఇరవై ఐదేళ్లుగా పనిచేస్తున్నాను. అయితే ఆ నీ రెక్కడ? ఈ నీ రెక్కడ!''

ఎన్నో విషయాలు తెలిసినవాడిలా బుర్రూపుతూ ఆ వింతమనిషి అన్నాడు.

''అది, బంగారంరంగునీరుకాబోలు!'' ఆశ్చర్యంతో అడిగేడు లక్ష్మీనాధుడు

''ఊహూఁ బంగారపు రంగు కాదు. ఆ జలాలు సముద్ర జలాలు. వాటిరంగు నీలం. ఆకాశంకన్నా నీలం.'' నవ్వుతూ చెప్పే డా మనిషి.

'ఓహో అందుకే కాబోలు ఈ మనిషి నీలంరంగు బట్టలు వేసుకుంట!' అనుకున్నాడు లక్ష్మీనాధుడు,

''సముందరం! సముందరం! ఎక్కడుంది? ఇక్కడికి చా లా దూ ర మా? కాస్సేపు ఊరుకుని అడిగేడు లక్ష్మీనాధుడు,

''చాలాదూరం కాక ఏమిటి? ఈ ఖాను మతీ నదిఉందా? ఇదివెళ్లి రూపవతిలో కలుస్తుంది. రూపవతి పోయి ఇచ్ఛామతిలో కలుస్తుంది. ఇచ్ఛామతి గంగానదిలో కలుస్తుంది. గంగానది వెళ్లి ఉపసాగరంలో కలుస్తుంది. ఉపసాగరం సాగరంలోనూ. సాగరం మహాసాగరంలోనూ కలుస్తాయి ఉత్తిసముద్రంకాదది. మహాసముద్రం, దాన్నే మహాసాగరం అని కూడా అంటారు, ఆ సాగరాన్నే పెద్దపడవలో నేను దా టి స్తా ను. నేనొక్కణ్నే కాదు. మేం. మేం అంటే. వేలకొద్దీ మనుష్యులం ఆ పెద్దపడవలో పనిచేస్తున్నాం.''

మహా ఆశ్చర్యంతో ఊపిరి బిగపెట్టి ఇదంతా లక్ష్మీనాధుడు విన్నాడు. ఆవింత మనిషి మహాసాగరం కధ మహా సాగరాన్ని పెద్దపడవలో దాటించే వింత కధ చెప్పుకు పోతున్నాడు. ఈ తీరంనుంచి ఆ తీరానికి మహాసాగరంలో చేరేకథ! వాళ్ళ సముద్రపురేవు పడవ మహా సాగరంలో తెల్లటి నురుగును వెదజిమ్ముతూ ఎన్నో వేల మైళ్ళు వెళ్లతుంది. అది ఇలాంటి మామూలు పడవ కాదు, ఓడ పెద్దఓడ, దాన్ని ఈ రేవు పడవలాగ గడ వేసి నడపక్కర్లేదు. పూర్వం అంటే

చాలారోజుల క్రితం ఎన్నో తెరచాపలు కట్టి నడిపించేవారు. ఇప్పుడు ఆవిరి యంత్రంతో నడుస్తుంది. ఆఓడ ఇలాంటి అలాంటి ఓడా? పెద్ద మేడ! అందులో ఓ ఆటలేమిటి, ఓ పాట లేమిటి. డాన్సు లేమిటి, ఓ విందు భోజనాలేమిటి అన్నీ అవుతాయి. దాంట్లో ఎన్ని దీపాలు ఎన్ని దీపాలు! రాత్రి చీకట్లలో పర్వతమెత్తు సముద్రతరంగాలమీద ఉయ్యాలలూగుతూ ఆ ఓడ నడుస్తుంది. దూరంనుంచి చూస్తే పెద్ద శరీరంతో కొండచిలువ నూరేసి మణుల మధ్య పాకుతోందేమో అని పిస్తుంది!

కాస్సేపు గుక్కతిప్పుకున్నాక ఆ వింత మనిషి మళ్ళీ చెప్పడం మొదలెట్టాడు.

"అదేం భానుమతీరేవా! ఆ సముద్రానికి ఎన్ని రేవులు! ఎన్ని దేశాలు? ఎన్ని రాజ్యాలు? ఎన్ని రాజదానులు? ఎన్నో వేల మైళ్ళదూరంలో ఉన్న రేవులకి ఆ ఓడ తీసుకువెళ్తుంది. ఎంతమంది మనుష్యులు! ఎన్నెన్నిపట్టణాలు! ఎన్నెన్ని ఓడరేవులు! లక్షేసి రూపాయలు ఖర్చుపెట్టి సముద్రాన్ని దాటివెళ్ళారు. దానికేం ఓ లెక్కా పత్రమా? ఎప్పుడెప్పుడో ఏమిటి? రాజకుమారుళ్లు ఎప్పుడూ అలా సముద్రం దాటి పైదేశాలకి వెళ్తూనే ఉంటారు. ఇదిగో కిందటేడే మా ఓడలో ఈజిప్టురాజకుమారులు విదేశానికివెళ్లేరు!"

ఉలుకూ పలుకూ లేకుండా కదలకుండా మెదలకుండా నిశ్చలంగా కూర్చున్న లక్ష్మీనాథుణ్ని చూసి ఆ వింత మనిషి లోలోపల ఏమనుకున్నాడో ఏమో కాని పడవ ఒడ్డుచేరేసరికి లక్ష్మీనాథుడి పక్కనే వెళ్ళి కూర్చున్నాడు.

"ఏం లక్ష్మీనాధ్! రావాలని ఉంటే నాతో రా! ఆ ఓడలో నీకు మరికాదివని ఇప్పిస్తాను" అన్నాడు.

"ఓడలో పని నువ్వు ఇప్పించగలవా!" ఎంతో పొంగిపోతూ అడిగేడు లక్ష్మీనాథ్.

''ఓస్ అదేం పెద్ద ఘనకార్యమా! ఓడకస్తాను నాకు బాగా తెల్సు నేను చెప్తే చాలు నిన్ను తీసుకుంటాడు.''

''అలాగా? అయితే రేపొద్దున్నే రా! మునసబుగారి ఇల్లు చాలా దూరం. ఒకటి న్నర కోసులు నడిచివెళ్ళాల. ఈ రాత్రి వారి ఊరికివెళ్ళి నా పనికి రాజీనామా ఇచ్చిరావాలి. ఈ రాత్రే వెళ్ళివస్తాను. పొద్దున్నే తప్పకుండా వస్తావా? మర్చి పోకేం!'' అన్నాడు లక్ష్మీనాథ్.

''ఛ నే నీలా మాటఇచ్చి ఎగ్గొట్టే వాణ్ని కాను'' నవ్వుతూ లక్ష్మీనాథుడి వీపుతట్టి ఆ వింతమనిషి చెప్పేడు.

ఆ రోజు రేవునుంచి లక్ష్మీనాథుడు ఇంటికి వెళ్లేసరికి అర్ధరాత్రి అవబోతోంది. వాడి మనస్సు ఉద్విగ్నమై ఉంది. ఏదో కొంత తిని, కాస్సేపు అలసట తీర్చుకుని రాజీనామా ఇవ్వడానికి మూడు మైళ్ళ దూరంలో ఉన్న ఊరికివెళ్ళాలి. రేవు పని ఎలా ఆగిపోయింది? రేవు కట్టేడానికి వీల్లేదు. సరిగ్గా సమయానికి కబురు చెయ్యకపోతే కొత్త మరకాడు పనికి కుదిరి రాలేడు. కొత్తమరకాడు రాకపోతే లక్ష్మీనాథుడికి సెలవు దొరకదు. తొందర తొందరగా ఆడుతూ పాడుతూ నాలుగు మెతుకులు తిన్నా ననిపించుకుని వాడు ఊరికి బయల్దేరేడు.

ఆయాసంతో రొప్పుతూ వాడు నడు స్తున్నాడు. మహా సముద్రంలో వింత లతో నిండిఉన్న పెద్ద ఓడ వాణ్ని పిలు స్తోంది. ఆ సముద్రంలో నీలపు కెరటాలు పర్వతం అంతమీదకి లేచి విరిగిపడుతూ ఉంటాయి. పెద్దపెద్ద తిమింగిలాలు నీటిని ఫౌంటన్‌లా మీదకి చిమ్ముతూ చెప్పలే నంత వేగంతో తిరుగుతూ ఉంటాయి. ఆటపాటలతో, నవ్వులతో ఎగిరిపోయేఓడ —ఆ సముద్రం, సంచల తరంగాలు, ఆ ఆకాశం—వాటిలో వాడి మనస్సు లగ్న మైపోయింది. ఏభై ఏళ్ళ తర్వాత అస్సలు ఓడదగ్గర్నుంచి వాడికి పిలుపువచ్చింది.

వాడు నడుస్తున్న మైదానానికి అటు వేపునుండి ఎవరో వాడి కెదురువచ్చేరు. ఆ వచ్చే మనిషి లక్ష్మీనాథుణ్ని చూసి ఆగి పోయి గట్టిగా కేకేసి పిల్చేరు.

''లక్ష్మీనాథ్!''

లక్ష్మీనాథుడి ఆలోచనలూ, కలలా

---

● ''సినిమా ఎలా ఉందోయ్?''

''చాలా కామెడీగా ఉంది. హీరో హీరోయిన్లు చచ్చిపోయే సీను మరీ మరీ నవ్వు తెప్పిస్తుంది.

—తెలిచేటి శ్రీనివాసరావు, కాకినాడ.

సార్. చిన్నడౌటండీ! మా అమ్మ చెల్లెలి అత్త గారి తండ్రి పెద్ద కూతురి భర్త తమ్ముడి నాల్గవ అబ్బాయి నా కేమవుతాడు సార్! —




చెదిరిపోయేయి. ఎదురుగా ఉన్న మనిషిని చూసేడు.

"లక్ష్మినాధ్, ఇంతరాత్రప్పుడు ఎక్కడికి వెళ్తున్నావ్!" ఆ మనిషి అడిగేడు.

"రేవుపనికి రాజీనామా ఇవ్వడానికి మునసబుగారి ఇంటికి వెళ్తున్నాను. రేపొద్దున్నే మహాసముందరంలో మరకాడిగా వెళ్ళిపోతాను." చెప్పేడు లక్ష్మినాధ్.

"రేపొద్దున్నే?"

"ఆఁ రేపొద్దున్నే! నీలం బట్టలు కట్టుకున్న ఆ వింతమనిషికి మాటిచ్చేనుగా!"

"నువ్వెళ్ళిపోతున్నావ్ లక్ష్మినాధ్! మరోదారి ఏదో నువ్వే చెప్పు" ఎంతో గాభరాతో అడిగే డా మనిషి. వాడిమొహం నల్లగా మాడిపోయింది.

ఆ మనిషిని లక్ష్మినాధుడు తేరిపార చూసేడు. కాని వాడికి ఆ మనిషి ఎవరో జ్ఞాపకం రాలేదు.

"నువ్వెవరివి? దారేమిటి?" ఆశ్చర్యపోతూ అడిగేడు లక్ష్మినాధ్.

"ఇచ్ఛాపురంలో ఉండడానికి వస్తున్నాను. కొద్ది రోజుల్లో నా చిన్న కొడుకు కూడా వస్తాడు.

"అదా!"

"నది దాటాలి కదా! నువ్వెళ్ళిపోతే ఎలాగా అని బెంగగా ఉంది."

''దానికంత బెంగ ఎందుకు? నే వెళ్ళిపోతే కొత్త మరకాడు మరోడు ఎటూ రేవుకి వస్తాడు. వాడే మిమ్మల్ని రేవు దాటిస్తాడు.''

''అదేంకాదు లక్ష్మీనాధ్, నీకు తెల్సు కదా! భానుమతిలో ఎన్నెన్ని సుడిగుండా లున్నాయో! అ సుడిగుండాల్ని తప్పిస్తూ పడవ నడపడం ప్రతీవాడికీ వస్తుందా? నా కొడుకు సుడిగుండానికి చిక్కి మునిగి చచ్చిపోతా డేమో అని భయంగా ఉంది'' ఆ మనిషి తలాడిస్తూ అన్నాడు.

"ఆఁ, ఆ మాట నిజమే! సుడిగుండా లున్నాయి. పడవని కాస్త నేర్పుతో నడపాలి. అయినా మునసబుగారు మరీ చేత కాని వాజమ్మని మరకాడిగా ఎందుకు వేసారు' లక్ష్మీనాధ్ పైకి అందంఅయితే అన్నాడేకాని పక్కఊరి మరకాళ్ళ చిన్నాడితో తనే అన్నమాట జ్ఞాపకం వచ్చింది. ''ఇచ్ఛాపురం రేవులో పడవ నడపడం ప్రతి అల్లాయిటుల్లాయివాడి పవేం కాదు!" లక్ష్మీనాధుడి జవాబుతో ఆ మనిషికి తృప్తి కలగలేదు.

''లక్ష్మీనాధ్! నా కొడుకు రేపు దాటి ఇచ్ఛాపురం వచ్చేవరకూ కాస్త ఉండవా?" ఎంతో ఆదుర్దాతో ఆ మనిషి అడిగాడు.

''అబ్బే, అలా ఎలా కుదురుతుంది అన్నా? రేపు మహా సముందరానికి నేను వెళ్ళితీరాలి!" మొహం కాస్త మాడ్చుకుని వీలుపడదని బుర్రూపుతూ చెప్పేడు లక్ష్మీనాథుడు.

ఆ మనిషి లక్ష్మీనాధుడి మొహం వేపు చూసి మళ్ళీ ఏదో అనబోయి ఏమీ అనలేక వెళ్ళిపోయేడు.

అయానంతో రొప్పుతూ లక్ష్మీనాధుడు పరుగు పరుగున మళ్ళీ నడక మొదలెట్టేడు. ఒంటి గంటన్నరకి మునసబుగారింటికి వెళ్ళకపోతే పని కాదు. నడుస్తున్నవాడల్లా హఠాత్తుగా ఓ దగ్గర ఆగిపోయేడు. వాడికి ఆశ్చర్యం వేసింది. వాడి మనస్సులో మహాసముద్రంతో పాటు మరో చిత్రం కూడా కవిపించింది. మనసులో ఉన్న ఆ చిత్రం మెల్లి మెల్లిగా కళ్ళ ముందర కొట్టొచ్చినట్టు కవిపంచసాగింది. ఇచ్ఛాపురం రేవులో ఏడేళ్ళ చిన్న పిల్లాడు నిల్చుని ''లక్ష్మీనాధ్! లక్ష్మీనాధ్!'' అని పిలుస్తున్నాడు. భానుమతీరేవులో కొత్త మరకాడు పడవలో కూర్చుని ఉన్నాడు. వాడు ఆ పిల్లాణ్ణి పిల్చి ''రా, చిట్టిబాబూ! నది దాటిస్తాను రా'' అన్నాడు. కాని ఆ పిల్లాడు బుర్ర అడ్డంగా తిప్పి ''నేన్రాను. నీ పడవలో నే నేనెక్కను. లక్ష్మీనాధుడొచ్చే వరకూ ఇక్కడే కూర్చుంటాను లక్ష్మీనాధుడొచ్చేకే నేను రేవు దాటతాను'' అన్నాడు. కొత్తమరకాడు పిల్లాడి మాటలని లక్ష్యపెట్టకుండా బలవంతంగా తీసి కెళ్ళి పడవలో కూర్చోపెట్టేడు. భానుమతీ నదిలో దొంగ సుడిగుండాలు తిరుగుతున్నాయి. పడవ వెళ్లేతోవలో ఎన్నెన్నో గుండాలు పాతాళానికి ముంచేసేవి ఉన్నాయి. వీటి వేటివేపూ కొత్త మరకాడి దృష్టే లేదు. వాడు పడవని వదిలేసేడు.

"అగు అగు. పడవ వదలకు, అగూ! ఆ పిల్లాణ్ణి నేను రేవు దాటిస్తాను...." లక్ష్మీనాథ్ గట్టిగా పిచ్చివాడిలా అరిచేడు.

ఇలా అరిచేక వాడి ముందున్న మాయంతా కరిగిపోయింది. పిండారబోసినట్టు వెన్నెల. ఆకాశం కింద బట్టబయలు మైదానంలో నిల్చుని ఉన్నాడు. వాడు ఎవరిని అరిచి ఏమిటిలా చెప్తున్నాడు? గజగజా వణికిపోతూ ఎవరితో మాట్లాడుతున్నాడు? ఇదంతా ఏమిటి? కలా? మాయా? ఏరీ? ఎక్కడా ఎవరూ లేరే!

"అయ్యో లక్ష్మీనాథ్! ఎక్కడికి వెళ్ళిపోతున్నావ్? నువ్వెళ్ళిపోతే ఇచ్ఛాపురం రేవు ఆగిపోతుంది." ఎవరో హద్దుల్లేని ఆకాశంలోంచి పెద్దగా నిట్టూర్చి గట్టిగా అన్నారు!

"ఏమిటిదంతా? ఇలా అవుతోంది?" అనుకున్నాడు లక్ష్మీనాథ్. వెనక్కి తిరిగి చూసేడు.

'మేమంతా ఇచ్ఛాపురం రేవు దాటి వస్తాం. నువ్వెళ్ళిపోతే మమ్మల్ని రేవు ఎవరు దాటిస్తారు?" ఎంతోమంది ప్రయాణీకులు ఎంతో దూరం నుంచి అంటున్నారు.

"అయితే నిజమా?" లక్ష్మీనాథుడు లోలోపల అనుకున్నాడు. వాడు వెళ్ళిపోతే ఖానమతి నీటి సుడిగుండాల్ని తప్పిస్తూ పడవని నడిపే మరకాడు ఎవడూ ఉండేవుండడు. వాడు వెళ్ళిపోతే ఇచ్ఛాపురం రేవు ఆగిపోతుందా? రాత్రి వెన్నెట్లో ఇచ్ఛాపురం రేవు వాడి మనసంతా అభిమానంతో నిండిపోయింది. మహాసముద్రం—దాన్ని దాటించే పెద్ద ఓడ—వాటినీ మరిచిపో లేకుండా ఉన్నాడు. రెండింటి మధ్యా పడి వాడి మనస్సు గిలగిల్లాడింది. రెండు చేతులూ పైకెత్తి నమస్కరించి దేవుడికి మొర పెట్టుకున్నాడు.

"ఓ ప్రభూ! ఇచ్ఛాపురం రేవు దాటే వాళ్ళ కోసం, వాళ్ళని రేవు దాటించడం కోసం ఇక్కడే ఉండిపోతున్నాను. నన్ను ఎక్కువ కాలం ఈ చిన్న పడవలో మరకాడుగా ఉంచకు. మహాసముద్రంలో ఓడ నడపడానికి పంపు."

మర్నాడు తెల్లారుతూనే ఆ నీలం బట్టల మనిషి వచ్చేడు. లక్ష్మీనాథుడు ఇంట్లో లేడు. ఆ మనిషి ఆశ్చర్యపోయి రేవు వేపు చూసేడు. రేవులో ప్రయాణీకులు పడవ ఎక్కుతున్నారు. పడవలో లక్ష్మీనాథుడు నిల్చుని ఉన్నాడు.

"కొత్త మరకాడు వచ్చినట్టు లేదే!' రేవు కెళ్ళి లక్ష్మీనాథుణ్ణి అడిగేడు.

"లేదు. రాలేదు."

"పొద్దున్నే నాతో వస్తానని చెప్పేవు. మనస్సు మారిపోయిందా?"

"లేదన్నా. మహాసముందరంలో ఓడ నడపాలని చాలా కోరికగా ఉంది. అయితే ఏం చెయ్యను? ఎంతమందో రేవు దాటి

తానికి వస్తున్నారని కబురుతెలిసింది. నేను నీతో వచ్చేస్తే వాళ్ళు రేవు దాటలేరు.''

''అయితే నేనెన్ని రోజులు ఇక్కడుండనూ? నువ్వొచ్చేటట్లయితే....''

''నువ్వెళ్ళు అన్నా! వాళ్ళంతా రేవు దాటడానికి ఎప్పుడొస్తారో ఖచ్చితంగా తెలీదు. వాళ్ళొస్తారన్న సంగతి నిన్న రాత్రి గుర్తుకు వచ్చింది.''

''వావయితే! ఇక్కడే ఈ పాచిపోయిన కుళ్ళు రేవులో పడవ నడుపుతూ పడి ఉండు. పెద్ద ఓడలో మరకాణ్ణి చేద్దామని అనుకున్నాను. నీ నుదుటిని రాసి లేందే! ఆ మనిషి వెళ్ళిపోతున్నాడు లక్ష్మీనాధుడు గభాల్న వాడి చెయ్యి పట్టుకున్నాడు.

''అన్నా! కోపం తెచ్చుకోకు. నీ పై విలాసం ఇయ్యి, నీ నగరికి వస్తాను. మహాసముద్రంలో ఓడలోకి వస్తాను." జేబులోంచి ఓ కాగితం ముక్క తీసి ఆ మనిషి లక్ష్మీనాధుడి చేతికిచ్చేడు.

''ఇదే నా విలాసం. సంవత్సరానికి ఓసారి ఇంటికి రావడానికి సెలవు దొరుకుతుంది. ఆ తారీఖున కలకత్తా గంగారేవుకి వస్తే నన్ను కలుసుకోవచ్చు."

ఆ మనిషి వెళ్ళిపోయేడు. లక్ష్మీనాధుడు గట్టిగా నిట్టూర్చి ప్రయాణీకులతో నిండి ఉన్న పడవని వదిలేడు.

ఇది అయి ఎన్నో రోజులయింది. ఎంతోమంది ప్రయాణీకులు ఈ గట్టునుంచి ఆ గట్టుకి, ఆ గట్టు నుంచి ఈ గట్టుకి నది దాటి వెళ్తున్నారు. భానుమతీ నదిలో ఆరు ఝాములూ పడవ నడుస్తూనే ఉంది. ఈ రోజు అందరి ప్రయాణీకుల్ని దింపేస్తే తనకి సెలవు దొరుకుతుందని ప్రతీ రోజూ లక్ష్మీనాధుడు అనుకుంటూ ఉండేవాడు. ఈ రోజుతో తనకి సెలవు అని ప్రతీ రోజూ అనుకునేవాడు. రాత్రి పక్కమీద పడుకుని దేవుడికి మొర పెట్టుకునేవాడు.

''ప్రభూ! ఇంక సెలవిప్పించు.''

"వద్దు-వద్దు. నువ్వెళ్ళొద్దు లక్ష్మీనాథ్. మేం ఇచ్ఛాపురం రేవు దాటడానికి వస్తున్నాము. ప్రస్తుతానికి నువ్వు వెళ్ళొద్దు.'' ఎంతో దూరంనుంచి ఎంతమందో అంటున్నట్టు వాడికి వినిపించేది. మహా సముద్రాన్ని చూడాలన్న కోరిక రోజురోజుకీ పెరుగుతోంది.

''ఓ ప్రభూ! పరాత్పరా! ఇంకా ఎంత

---

● నిర్మాత పత్రికా విలేఖరితో :—మా సినిమా చూస్తున్నంతసేపూ ప్రేక్షకులు తప్పట్లు కొట్టాల్సిందే!

పత్రికా విలేఖరి :—ఏం జేశారేమిటి?

నిర్మాత :—ప్రతీ షాట్‌లోనూ గాంధీ నెహ్రూల బొమ్మలు పెట్టాం.

—వెలిచేటి శ్రీనివాసరావు, కాకినాడ.




మంది ప్రయాణీకుల్ని నా కోసం పంపుతున్నావు? నా రోజు లైపోతున్నాయి. మహాసముందరంలో ఓడ్డునపడడం అదే లేదు' ఓ రోజు ఎంతో దుఃఖంతో దేవుణ్ని ప్రార్థించాడు.

"ఛత్. ఇలా అయితే ఇంకెన్నిరోజులవుతుందో! ప్రయాణీకుల్ని రానీ, వచ్చి వెళ్ళిపోనీ, వాళ్ళకి నేనేం పత్రం రాసి యిచ్చేనా? వాళ్లని నేనే రేవుదాటిస్తానని" ఆ రోజు లక్ష్మీనాధుడు అనుకున్నాడు. ఆ రోజు రాత్రి తన బట్టలూ. డబ్బూ దస్కం అంతా మూట కట్టుకున్నాడు. మర్నాడు కలకత్తా గంగారేవుకి వెళ్లాడు. మూటకట్టేక క్రొత్త నడుం చేరేసేడు.

ఉన్నట్టుండి వాడికి జ్ఞాపకం వచ్చింది. ఎన్నోరోజులక్రితం మునసబుగారింటికి రాజీనామా యివ్వడానికి వెళ్తున్నప్పుడు దారిలో ఎవరో అపరిచితవ్యక్తి తన కొడుకుతో రేవు దాటతానని చెప్పేడు. ఆ రాత్రి ఆ మైదానంలో ఓ కలలా వాడికి కనిపించింది. ఆ చిన్నపిల్లాణ్ని అల్లాయిటూల్లాయి చేతకాని కొత్తమరకాడు రేవు దాటించబోయేడు. అదిచూసి "ఉండు, ఉండు ఆ పిల్లాణ్ని నేను దాటిస్తానని తను గట్టిగా అరిచేడు. ఆ కుర్రాడు రేవు దాటేడా! లేదే! సంవత్సర మైపోయింది. ఇంకా రాలేదు. సంవత్సరం పొడుగునా రేవు దాటించిన యాత్రికుల్ని ఒక్కొక్కర్ని

లక్ష్మీనాథుడు జ్ఞాపకం తెచ్చుకున్నాడు. ఈ ఏడు ఎవరూ కుర్రాడు రేవు దాటినట్టు వాడికి గుర్తు రాలేదు. ఆ పిల్లాణ్ని రేవు దాటిస్తానని అన్నాడు. అయ్యో! ఆపిల్లాడు వచ్చేవరకూ వాడికి సెలవులేదు. చీకట్లోనే తను కట్టుకున్న మూటని విప్పేయడం మొగలెట్టేడు.

''ఎవరది?'' బార్లా తెరిచి పెట్టి ఉన్న వీధి గుమ్మంలోంచి చూసేడు. నిర్జనంగా ఉన్న రేవులో ఓ పిల్లాడు నిల్చుని ఉన్నాడు. ఎగ శ్వాసతో రొప్పుతూ లక్ష్మీనాథుడు రేవుకి పరిగెట్టుకు వెళ్లేడు. అమ్మయ్య! ఆ పిల్లాడు వచ్చేసేడు. వాణ్ణిరేవు దాటిం చేస్తే తనకి సెలవు దొరుకుతుంది. మహా సముద్రంలో ఓడనడిచే అవకాశం దొరుకు తుంది.

''రా. రా. పడవలోకి రా '' కట్టేసి ఉన్న పడవని విప్పి లక్ష్మీనాథుడు పిల్లాణ్ణి పిలిచేడు. పిల్లాడు నవ్వుతూ పడవ ఎక్కేడు.

చాలా ఆలస్యంగా వచ్చేవా లక్ష్మీనాథ్! సంవత్సరం కితం రావల్సినమాట! మహా సముద్రంలో ఓడ నడపడానికి ఆలస్యం అయిపోయింది కదూ!" పిల్లాడు నవ్వుతూ అడిగేడు.

లక్ష్మీనాధుడు ఇంత తియ్యటి మాటల్ని తన బతుకులో ఎప్పుడూ వినలేదు.

అవుననుకో అయినా నువ్వు రాకుండా నేనెలా వెళ్ళగలను బాబూ! భానుమతి సుడిగుండాల సంగతి ఎరగనా? సర్లే నువ్వొచ్చేసేవ్! ఇంక ఈ ఇచ్ఛాపురం రేవువదిలేసి మహాసముద్రానికి వెళ్తాను."

''నిజంగా'' నవ్వుతూనే అడిగేడు పిల్లాడు. పడవ ఒడ్డు చేరింది.

లక్ష్మీనాథ్! నువ్వేమో వెళ్లిపోతావ్! కొత్తమనకాడికి సుడిగుండాల మధ్యనుంచీ పడవ నడిపే తీరు నేర్పి మరీ వెళ్లేం?'' పడవ దిగి పిల్లాడు అన్నాడు.

''ఏం? ఎందుకనీ?''

''మళ్లీ ఆ ఒడ్డుకి రేవు దాటి వెళ్తా నుగా మరి''

''ఎన్ని రోజుల తర్వాత తిరిగి వెళ్తావో చెప్పు. వింటాను. నువ్వు తిరిగి వెళ్లే దాకా నేనుండి పోతాను'' పిల్లాడి అందమైన చక్కటి మొహాన్ని చూస్తూ లక్ష్మీనాధుడు అడిగేడు.

''అదెలా కుదురుతుంది? తర్వాత మళ్లీ నది దాటి ఈ ఒడ్డుకి వస్తానే!''

---

డాక్టర్ పేషంటుతో :—నాకిదే మొదటిసారి లంగ్స్ ఆపరేషన్ చెయ్యటం. నేనాప రేషన్ చేస్తున్నప్పుడు మీరు ఊపిరి పీల్చడం మానెయ్యాలి లేకపోతే నాకు గుండేదో, లంగ్స్ ఏదో తెలియటం కష్టమవుతుంది. ఆ పైన మీ యిష్టం.

—వెలిచేటి శ్రీనివాసరావు, కాకినాడ

"దగ్గర దగ్గర ఇంకెన్ని రోజులు నేనుండాలో చెప్పు"

"అబ్బే! ఈ ఒడ్డునుంచి మళ్ళీ ఆ ఒడ్డుకి వెళ్తాను"

"ఇలా ఎన్నిసార్లు నది దాటతావైతే?"

"ఎల్లకాలం." నవ్వుతూ చెప్పేడు పిల్లాడు.

"అలాగే అయితే ఈ రేవులో నేనూ ఎల్లకాలం ఉంటాను." పిల్లాడి వేపు ముగ్ధుడై చూస్తూ లక్ష్మీనాథుడు అన్నాడు.

ఉన్నట్టుండి రాత్రి వెన్నెల కంపించింది. భానుమతి నదీజలం సన్నటి వెండి రేకలా జిగజిగ మెరిసిపోయింది. వాళ్ళి ద్దరకీ ఎదురుగా మరో నది బంగారపు రంగు పొంగు ముందుకు వస్తోంది. దాంట్లో బంగారపు పడవ!. బంగారపు తెరచాప!



ఒణికిపోతూ లక్ష్మీనాథుడు ఆ వింత పిల్లాడివేపు చూసేడు.

"భానుమతీ రేవునుంచి నీకు సెలవు దొరికింది లక్ష్మీనాథ్! మహా సముద్రం దాటి నువ్వు మరో పెద్దఓడలోకి వచ్చేవ్! స్వర్గపురేవులో బంగారపు పడవ నడుపుతావ్!" మృదువుగా నవ్వుతూ ఆ పిల్లాడు చెప్పేడు.

* * *

(ఆధునిక బెంగాలీ సాహిత్యంలో శిశు సాహిత్య వేత్తగా శ్రీ సతీకాంత్ గుహా అగ్రగణ్యులు. ఈ సంవత్సరం బెంగాలీ శిశు సాహిత్యవేత్తగా 'మోచ పారితోషికం పొందేరు. అయన చి పిల్లల కథ లనేకం వ్రాసేరు. కథానిక నాటికలు, కవితలు వారు రచిస్తా వాటిల్లో పడవ మరకాడు లక్ష్మీనా 'అపురూపమైన కథ', 'పేరు లేని గు 'చరిత్రలో లేదు' మొదలైన క సంచయం. ఎర్ర కమలం-నీలకమ అను పుస్తకం విశేషంగా ఆదర పొందేయి. కొద్దిరోజుల క్రితం అ భారతి కవిసమ్మేళనం తరపున శ్రీ గ సాహిత్య సేవని ఉగ్గడించి సన్మా చారు.)

ఉదయించి నాలు గ్గంటలన్నా కాకముందే, ఉడుకెత్తించేస్తు న్నాడు భానుడు. అర్జంటు పను న్న వాళ్ళూ, ఆఫీసుకెళ్ళవల్సిన వాళ్ళూ తప్ప మిగిలిన వాళ్ళంతా, ోడ్లని వాటి మానాన వదిలేసి, ళ్ళల్లోనే కూర్చున్నారు.

పనేమీ లేకపోవటాన్నే కారణంగా ట్టుకుని వీధులన్నీ ఓ మారు సర్వే చేసి, ప్పుడే గుమ్మంలోకి అడుగు పెట్టాడు ందర్రావు. పెడుతూనే సుడిగాలిలా చ్చి పడిందతడి చెల్లెలు.

"అన్నయ్యోయ్! నీకో శుభవార్త ప్పనా?' అంటూ.

"ఉండవే! నేను చెప్తానన్లేదూ?" పి చెయ్యి చీరె కొంగుకే తుడుచుకుంటూ ంట యింట్లోంచి గబగబా వచ్చింది భద్రమ్మగారు. వస్తూనే కొడుకు ముహంలోకి ఆప్యాయంగా చూస్తూ ంది :

"నీకో మంచి కబురు చెప్తే నాకే స్తావరా?"

మనసులోని చిరబురల్తో పాటూ, ండలో ఉలపట్లాడుతూ వచ్చిన సుంద రావుకి సహజ గుణమైన చిరాకు, మరో లు పెరిగింది. "ఈ నాన్పుడు ఏవిటి? చెప్పరాదూ?" ఒక్కసారి కసురుకున్నాడు. చిన్నబోయింది సుభద్రమ్మ ముఖం.

ఇంతలోకే చేతితో పొడుగాటి కవరుతో ప్రత్యక్షమయిందతడి చెల్లెలు.

"నీకు-ఉద్యోగమొచ్చిందన్నయ్యా!"

"సరే! అదేనా యింత హడావిడికీ కారణం? ఎలాగూ వస్తుందనుకొంటు న్నదేగా!" విసురుగా ఆ కవరందుకుని, తన గదిలోకి పోయి, కుర్చీలో కూల బడ్డాడు సుందర్రావు.

ఒళ్ళు మండిపోయింది సుభద్రమ్మకి.

"ఉద్యోగమొచ్చిందిరా అని కొండంత సంతోషంతో చెప్తే, ఎలా తీసి పారేస్తు న్నాడో!.... అయినా లేదిలా ఏవిటా గంతులు? పద వంటింట్లోకి, ఎంత పనేడు స్తోందో అక్కడ!" కొడుకు మీది కోపం కూతురి మీద చూపిస్తూ యథాస్థానంలో ప్రవేశించిందావిడ.

"హుం! ఉద్యోగం.. దొరికింది!" కవర్లోని కాగితాలు బయటికి లాగి, ఒక్క సారి అలాగే వాటికేసి చూసి, దీర్ఘమైన నిట్టూర్పొకటి విడిచాడు సుందర్రావ్.

"డిగ్రీ పొందిన మూడేళ్ళ తర్వాత! అది మాత్రం?"

గతమంతా పరిహాస పూర్వకంగా గంతులేస్తుంటే, భరించలేక, ఎడమ ముంజేత్తో కళ్లు మూసుకున్నాడు బాధతో.

* * *

# తిరుపతా - బాబాయి పరపతా?!

పి.వి.ఆర్.శివకుమార్



'నువ్వు బి. ఇ చదువుకోటానికి మాకేం అభ్యంతరం లేదొహో....' అని యూనివర్సిటీ వాళ్ళు, అంతకు ముందే తమ యూనివర్సిటీలో పి. యు. సి ప్యాసయిన సుందర్రావుకి తెలియజేసిన నాడు, అతగాడి సంతోషానికంతు లేదు। అతడితో పాటే యింటిల్లిపాదీనూ।

"మా వాడికి బి. ఇ లో సీటొచ్చిం దండీ।" ఇరుగింటి, పొరుగింటి పుల్లమ్మ లందరితోనూ చెప్పి మురిసి పోయిం దతగాడి తల్లి.

"మా అన్నయ్య ఇంజనీరు కాగానే

నాకివ్వి బంగారు గాజులూ, గొలుసూ.... ఇంకా పెర్లిన్ లంగాలూ, గొన్లూ అన్నీ కొని పెడతారు." నేస్తాలందరికీ చాటింది ఆరేళ్ళ ఆఖరి చెల్లి।

"విష్ యు బెస్ట్ ఆఫ్ లక్" అన్న ఉత్తరాల్తోటే చెయ్యి దులుపుకున్నారు, వాళ్ళ బతుకులే బతకలేక సతమతమవు ఇద్దరన్నలూ.

యూనివర్సిటీ వాళ్ళకభ్యంతరం లేక పోయినా, పరంధామయ్యగారికి మాత్రం కొండంత అభ్యంతరంగా వుంది కొడుకుని ఇంజనీరింగ్ కి పంపడం. మొన్న నే కూతురి పెళ్ళి చేసి కూడబెట్టుకున్నదంతా కరగబెట్టుకున్న ఆయనకి, మళ్ళీ కొడుకు చదువుకంటూ పది వేలు తేవాలంటే సులభ సాధ్యంగా కనపడలేదు।

"శుభ్రంగా ఉన్న వూళ్ళోనే బి. యస్సీనో చదువుకుంటే సరిపోదూ" అన్నాడాయన కొడుకుతో.

"ఆహా సరిపోతుంది। సరిపోతోందిగా పెద్దవాళ్ళిద్దరికీ। ఒక్కడికీ తమ సంసారాల్ని గడుపుకోవడమే చేతకావట్లేదు. వీణ్ణీ అలాగే తయారు చెయ్యండి. మనల్ని చివరి రోజుల్లో ఆదుకోవటానికి ఒక్కళ్లూ వుండరు।....

ఏమయినా సరే, వీడు బి. ఇ. చదవా

---

## అయితే ఫర్వాలేదు

డాక్టర్ భిషగానంద టేబిలుమీది టెలిఫోన్ అదేపనిగా గణగణ మోగసాగింది. విసుగ్గా రిసీవరెత్తి 'హలో' అన్నాడు డాక్టర్.

'హలో డాక్టరుగారూ, నమస్కారం. మా ఆవిడ కేదో అయినట్టుందండి... మాట్లాడలేక పోతోంది....'

'దవడలు కూడా కదల్చలేకుండా పోతుందా'

'అవునండి.'

'సరే—మీ అడ్రస్ ఏమిటి'

'నేను మీ క్లినిక్ కి దగ్గర్లోనే వున్నాన్లెండి. అయితే డాక్టర్‌గారూ ఆవిడని వైద్య సహాయం లేకుండా అలా ఓ వారం రోజులుంచితే మరేం ప్రమాదం వుండదంటారా?'

'వుండకపోవచ్చు.'

'అయితే సరే। వారం రోజులు పోయేక మీకు మళ్లీ కబురు చేస్తాన్లెండి.'

ల్సిందే। అంతగా అయితే, నా మెళ్లోవీ, చేతులవీ అమ్మనయినా అన్మేస్తాను. ఆ బ్యాంకులోది కాస్తా పెట్టారంటే వాడి చదువు పూర్తయి పోతుంది. ఆ తర్వాత వాడే చేస్తాడు చెల్లెలి పెళ్ళి.'' స్థిరంగా వుందావిడ గొంతు.

''కాకపోతే అప్పు చేసి చదివించండి నాన్నా! నా చదువు పూర్తి కాగానే తీర్చే స్తాను.'' ఇండియాలో యింజనీర్లకింకా డిమాండ్ వుందనే భ్రమ సుందర్రావుకి।

ఏం మాట్లాడలేదు పరంధామయ్య. ఆయనకీ తమ కొడుకు యింజనీరు కావాలనే వుంది. కానీ. పైస లేదన్నదే ఆయన బాధ। ఏమయినా సరే, చదివిద్దామనే నిర్ణయించుకున్నారాయాన. ఎదురుగా కనపడుతున్న భారాన్ని కనపడని వాడి మీదికి నెట్టుతూ। వైజాగ్‌కి తరలి వెళ్ళాడు జీవితం మీద ఆశతో సుందర్రావు.

* * *

ఆ అయిదేళ్ళూ సుందరరావు కన్న ఈస్ట్‌మన్ కలర్ కలలకు అంతేలేదు. 'కష్టపడి చదువుతున్న తను తప్పక ఫస్టు క్లాసులో ప్యాస్ కావాలి. వెంటనే మంచి ఉద్యోగంలో చేరిపోవాలి. తనకోసం నగ లమ్మటానికి సిద్ధపడ్డ అమ్మ వొళ్ళంతా బంగారంతో నింపాలి. తన చిన్నతనంలో నిండా నగలు పెట్టుకుంటే అమ్మ నిజంగా లక్ష్మీదేవిలా వుండేది. తిరిగి అమ్మ నలా చూడాలి తను। అప్పులన్నీ తీర్చేసి నాన్న ఆర్థికపరిస్థితి మెరుగుపరచాలి. అప్పరాటీ హైస్కూలు టీచ రుద్యోగంతో తన్ని చదివిస్తున్నారంటే, ఆయన పడుతున్న కష్టం తనకి తెలియనిది కాదు. చెల్లాయి! రాజాలాటి సంబంధం కుదిర్చి పెళ్ళి చెయ్యాలి.' ఇదే ధోరణి। ఇవే ఆలోచనలు।

అయిదేళ్ళూ. అతడికి అయిదు నిమిషాల్లా. పరంధామయ్య గారికి అయిదు యుగాల్లా గడిచిపోయాయి. అనుకున్నట్లుగా ఫస్టు క్లాసునే కాకుండా యూనివర్శిటీ థర్డ్‌రాంక్ గూడా సాధించగలిగిన రోజున సుందర్రావు పొందిన ఆనందం వర్ణింప తరంకాదు. అయిన అప్పు కలిగిన నగలూ అతడిని కలవర పెట్టనేలేదు. 'బోడిఅప్పు.మూడు రోజుల్లో తీర్చేయనూ।' అంటూ నిరసనగా చూశాడు వాటివంక.

మార్కులువచ్చి పదిరోజులవుతోంది. అనుకున్న దానికన్నా నాలుగు మార్కులు ఎక్కువే వచ్చాయి సుందరరావుకి.

ఆ రోజుఉదయం బయటికి పోబోతూ కొడుకుని కేకేశారు పరంధామయ్యగారు. ఆయన పనికట్టుకు పిల్చారూ అంటే, విశేషమేవుంటుంది. వెళ్ళాడుసుందర్రావు.

''ఇవాళ పదిగంటలకి వెళు। ఆ రామానుజంగార్ని కలుసుకో ఒకసారి. వాళ్ళ ఫ్యాక్టరీలో ఏదో ఖాళీగా ఉందట.''

రామానుజంగారు అదేవూళ్లో పేరున్న

పెద్ద ఫరంకి మేనేజర్. చిన్నతనంలో నుంచే కల్సి చదువుకున్నవాళ్ళు కావటాన కుచేల-కృష్ణుల స్నేహం వాళ్ళిద్దరిదీ.

"పేపర్లో ఎడ్వర్టయిజ్ మెంట్ రాలేదే!" నెమ్మదిగా అన్నాడు రోజూ పబ్లిక్ లైబ్రరీలో ఇంగ్లీషు పేపర్లన్నీ తిరిగ్గా తిరగేసి వస్తున్న సుందర్రావ్.... పెద్దాళ్ళిప్పించే ఉద్యోగాలకి పేపర్ ప్రకటన ఉండవని తెలీని పూర్ పెలో!

"ఎడ్వర్టయిజ్ మెంట్ పడ నక్కర్లేదోయ్! ఆయనతో నే నిన్ననే మాటాడేను. ఆయనెలాగో ఇరికిస్తాడు. ఆ టెస్టిమోనియల్స్ అవీ తీసుకెళ్ళి యివాళ కల్సుకో." కొంచెం విసుగు ధ్వనించింది పరంధామయ్యగారి కంఠంలో.

'అవును, కాదు' అన్లేదు సుందర్రావు.

"ఏమిట్రా ఇంకా ఆలోచిస్తున్నావ్?" సంశయంగా అన్నారు పరంధామయ్య గారు. కొడుకు ఎమ్. ఇ. కి వెళ్తానంటాడేమో నని ఆయన కంగారు.

"క్షమించండి నాన్నా. నా రాంక్ మీదా స్వశక్తిమీదా నాకు న మ్మ క ముం ది." తండ్రంటే ఒణికిపోయే సుందర్రావు ఆ మాటలెలా అనగల్గాడో, అతనికే తెలీదు!

ఉలిక్కిపడ్డారు పరంధామయ్యగారు. "అంటే ఏమిట్రా నీ ఉద్దేశం? సూటిగా ఏడు!"

"నా తెలివి తేటలవల్లా, మార్కులవల్లా కాక ఒకరి సహాయ సంపత్తులవల్ల దొరి ఉద్యోగం నేను వేయదల్చుకోలేదు."

పరంధామయ్య గారికి చిర్రెత్తుకొచి నట్లు ఆయనమాట తీరే చెబుతోంది.

"అఘోరించావు లేవోయ్! నీ స్వశ మీద ఉద్యోగం రావాలంటే ఏళ్ళు ప తుంది! రోజూ పేపర్లో చూడట్లేద ఎంతమంది నిరుద్యోగ యింజనీర్లు రి తొక్కుతోందీ? యీ రోజుల్లో వీ బో మార్కులు చూసి ఎవడోయ్ ఉద్యో మిచ్చేది?

వెళ్ళు వెళ్లు. పిచ్చిపిచ్చి కబుర్లుచెప్ప వెళ్ళి ఆయన్ని కలుసుకో." కోపం అరిచి బయటికి వెళ్ళిపోయా డాయన.

కానీ, సుందర్రావుమాత్రం కదల్లే

* * *

చూస్తుండగానే గంటలు రోజు గానూ, రోజులు నెలలుగానూ, నాయకు పార్టీలు మార్చినంత వేగంగా మారి తున్నాయి. ఏదోసారి కేలండరు కాగి చింపుతూ, అలాగే ఆగిపోయాడు సు ర్రావు.

"అప్పుడే రిజల్టువచ్చి ఏడు నె గడిచిపోయాయా? మతిపోయిం దతడ ఈ ఏడునెలల్లోనూ ఎన్ని ఉద్యోగా అప్లయ్ చేశాడో లెఖ్ఖలేదు. చాలా కేషన్లు చిత్తుబుట్టలకే ఆహుతి కావట విచిత్రం! కొన్ని ఉద్యోగాలకి మ్యా




యింటర్వ్యూలు వచ్చాయి. కానీ. అవి ఖర్చు పెంచటానికి తప్ప. జీ(వి)తమివ్వటానికి తోడ్పడలేక పోయాయి। వందలు ఖర్చయ్యాయి గానీ, వందరూపాయల ఉద్యోగమయినా రాలేదు.

కొందరు సెకండ్ క్లాసులో ప్యాసయిన మిత్రులు సహితం ఏవో ఉద్యోగాలు పెద్దవో. చిన్నవో 'సంపాదించుకో' గలిగారు. కానీ సుందర్రావు మాత్రం అలాగే... ....

ప్యాసయిన క్రొత్తలో ఎంతో ఘనకార్యం సాధించినట్లు సెకండ్ క్లాస్ వాళ్ళందరివంకా నిరసనగా చూసేవాడు ఈ రోజు వాళ్ళముందర తలెత్తుకోవాలంటే, ఏదో తప్పు చేసినవాడిలా వుదతడికి.

మొన్న మొన్నటిదాకా ఏమీ తోచనప్పుడల్లా వీధులన్నీ తిరిగితిరిగి యిల్లుచేరేవాడు. కానీ ఈ మధ్య బజార్లోకి వెళ్ళాలంటేనే భయంగావుంటోంది।....స్నేహితుల భయం।....

రిజల్టు రాగానే అందరితోనూ చెప్పాడు "యూనివర్సిటీ థర్డ్ ర్యాంకోయ్! అంటూ. అదే పెద్ద ప్రమాదమయి

పోయింది యిప్పుడు బజార్లోకి వెళ్తే వాళ్ళు, ఎవడో ఒకడు కపబడ్డం, ఏదో ఒకటి అనటం.

"ఏరా! ఎక్కడయినా జాబ్ దొరి కిందా" రాలేదని వాళ్ళకి తెలుసు. లేదని చెప్పించటం, ఏడ్పే తన్నని చూసి నవ్వటం వాళ్ళకి వినోదం.

"లేదురా యింకా" అన్న సుందర్రావు సమాధానం వినగానే పెద్దగా ఆశ్చర్యం నటించటం!

"ఇంకా రాలేదూ? అదేమిట్రా? యూని వర్సిటీ ర్యాంక్ హోల్డర్‌వి! వెధవది సెకండ్ క్లాసులో ప్యాసయిన సుబ్బారావూ, ఆంజనేయులూ సంపాదించేశారు. నీకింకా రాలేదూ?"

"ఆఁ....యీ మార్కుల గొప్పంతా కాలేజీ కాంపౌండ్‌లో నేరా. బయటికి వస్తే యింక వీటినెవడు చూస్తాడు? ఉత్త రాయణమో-దక్షిణాయనమో! ఈ రెండూ లేనిదే, యీ రోజుల్లో ఉద్యోగాలెక్కడివి? అందులోనూ యింజనీర్లకి?" ఇంకో స్నేహితుడి కామెంట్.

"అన్నట్లు ఆ రామానుజంగారు మీ ఫాదర్‌కి ఫ్రెండేనేమో, ఆయన్ని పట్టక పోయావా?" మరో మిత్రుడి (?) ఉచిత సలహా.

"ఆఁ....ఏదో స్నేహమున్నంత మాత్రాన ఉద్యోగాలిస్తారుట్రా?" మరోడి ఉవాచ.

'ఆయనిస్తానన్నారు. నేనే వొద్దన్నా నంటే' నమ్మకపోగా, మొహమ్మీదే నవ్వే స్తారని భయం వేసింది సుందర్రావుకి.

ఆఖరిగా, "ఏమిటో, ఇంత కష్టపడి చదివిన నువ్వూ ఒకటే. ఏమీ చదవని మేమూ ఒకటే! ఎందుకు చదివినట్టో," సానుభూతినీ, జాలినీ వొలకబోస్తున్న ట్లుగా. వ్యంగ్యానికి సానుభూతి కోటింగ్ పోటీస్తూ వెళ్ళిపోయారు వాళ్ళు.

ఒళ్లు మండిపోయింది సుందరావికి.

"ఒరేఁ విద్య కేవలం ఉద్యోగాల కోసమే కాదురా! విజ్ఞానం కోసం కూడా! ఇవాళ కాకపోయినా మరో నాలుగు రోజులకయినా నాకొక ఉద్యోగం దొరక్క పోదు. కానీ మీ బ్రతుకులు మాత్రం ఎన్నేళ్ళయినా యిలా రోడ్లు సర్వే చెయ్య టానికేరా!

రికమెండేషన్లే పట్టదల్చుకుంటే, యీ రామానుజంగారు కాకపోతే, బెంగుళూర్లో పన్జేస్తున్న మా బాబాయయినా యిప్పించక పోడురా! కాని, స్వశక్తి మీద విశ్వసనాదే నా వ్యక్తిత్వానికో విలువ! చూస్తుండండి. మీ ముందే మరో నాలుగు నెల్లకయినా, జాబ్ సంపాదించి, మీ అందరూ ఏడు స్తుండగానే అంతస్థుల్ని అందుకుంటా!" మనస్సులోనే కసి తీరా అరిచాడు.

పెళ్ళికాని ఆడపిల్లలన్నా, ఉద్యోగం లేని మగవాళ్ళన్నా యింట్లోవారి కంటే లోకులకే యింట్రస్టు ఎక్కువ!

ఇరుగు పొరుగు వారికందరికీ యిదే పట్టుకుంది.

"ఏమమ్మా వదినా, మీ వాడు అదేదో ఫస్టున ప్యాసయ్యాడన్నావు గదా, ఇంకా ఎక్కడా ఉద్యోగం కుదరలేదూ?...." అంటుంది సావిత్రమ్మో మధ్యాన్నం తీరుబడిగా తిష్ఠ వేసి.

"ఆఁ! ఏం నౌకరీలో లెద్దూ! ఏం చదివినా రావట్లేదు. పాపం, సొమ్ములు కూడా అమ్ముకుని మరీ చదివించె! ఫలితం లేకపోయె!" మరో పోచమ్మ సానుభూతి!

ఎంత కోపం వచ్చినా, ఎవర్నీ ఏమనగల్దు సుభద్రమ్మ? కొడుకునే సాధించేది.

"ఇరుగు పొరుగు ఏమంటున్నారో వింటున్నావుగా! ఏం ఖర్మరా నీకు? విశేషమల్లే చదువుకున్నవాడివి. నాన్నగారి మాట విని ఆయనెవర్నో కలుసుకోరాదూ? పోనీ పరాయి వాళ్ళనడగటం నీకిష్టం లేకపోతే మీ బాబాయినయినా అడగరాదూ?"

ఆశగా అన్న ఆవిడ మాటలకు సుందరం మౌనమే తిరుగులేని జవాబు!

* * *

కాలచక్రం ముందుకు పరుగెడుతూ రెండు సంవత్సరాల్ని వెనక్కి నెట్టేసింది. వయసు మించుకు వచ్చిన పరంధామయ్య గార్ని 'మీరింక పన్జెయ్యలేరు మాస్టారూ! హాయిగా రెస్టు తీసుకోండ'ని రిటైర్

చేసేశారు గవర్నమెంట్‌వారు. సుంద ర్రావుని మాత్రం 'పన్నేద్దువు గాసీ, రావోయ్' అని పిలవలేదు।

వరంధామయ్యగారికి వచ్చిన ప్రావి డెంటు ఫండ్సూ వగైరాలన్నీ పుత్రుడు తీర్చేసాకా ఆగలేని అప్పుల వాళ్ళు జమ కట్టుకు పోయారు. వట్టి చేతుల్తో స్కూలు గేటు దాటారు ఆయన.

ఇంటికి వస్తూనే అంతులేని నిస్పృహ ఆవరించిందాయన్ని. కొడుకు ఆదర్శాల మీద నమ్మకమూ సన్నగిల్లింది. 'ఇదో ఎత్తు. పన్చెయ్యటానికి బద్ధకం, పెడు తుంటే తిని కూర్చుందామని ప్రయత్నం' కసిగా అనుకున్నారు మనస్సులోనే. కానీ ఏమనగలరు? 'కడగొట్టు కొడుకు. గారా బంగా పెరిగినవాడు.'

ఇంటికి రాగానే గుండెలమీది కుంపటి చెంబుతో నీళ్ళు తెచ్చి యిచ్చింది కూతురు. దాన్ని చూస్తూనే ఆలోచన్లు అటు మళ్లాయి మళ్ళీ.

''ఇదప్పుడే పవిటలు వేసేసు కుంటోంది. మరో రెండేళ్ళు పోతే, చీరెలు కట్టుకోవాలి, అవి కొనటానికో మొగుణ్ణి తెమ్మని కూర్చుంటుంది.... కొడుక్కి బి. ఇ డిగ్రీ కొని పెట్టటానికే పది వేలారిపోయాయి. ఇంక దీనికి మొగు ణ్ణెలా కొని తేవాలి?''

తన అసహాయతకి తననే నిందించు కుంటూ కుర్చీలో కూలబడ్డాడు వరంధా మయ్యగారు.

• • •

ఈ మధ్య రిటైరయిన మూడు నెలల్నుంచీ తండ్రి తనతో మాట్లా డటం మానివేశారన్న సంగతి గమ నించినా, మనసులోనే ఏడ్చుకుని పూరు కున్నాడు సుందర్రావ్. కావి, తల్లి కూడా ఏదో ఒకటి సూటీ పోటీగా అనడం ప్రారంభించింది మధ్య. ఏ ఎలుక మీదో, పిల్లి మీదో పెట్టి. అవును మరి, మొగుడు రెగ్యులర్‌గా తెచ్చి పడేసినంత కాలమూ తనూ వేళ తప్పకుండా వండి వార్చింది. ఆవిడ మాత్రం ఏం చేస్తుందింక?

ఈ రెండు నెలలుగానే తెలుస్తోంది.. సుందరానికి నిజంగా జీవితమంటే ఏమిటో కష్టాలెలా వుంటాయో। ఇంట్లో ఏ విలు వయిన వస్తువున్నా సరే, యీ రెణ్ణెల్లలో బజారుకెళ్ళి పోయి. సరుకుల్ని పంపే శాయి. ఇంకేం మిగల్లేదు మరి।

తల్లీ తండ్రీ చిన్ననాటి నుంచీ ఎంత ముద్దుగా పెంచారో తనని సుందర్రావుకి తెలుసు. నాన్న రిటైరయ్యేదాకా, అతడి నిరుద్యోగాన్ని యిద్దరూ పట్టించుకోలేదనీ తెలుసు. కానీ తమ రాబడి ఆగిపోవ టమూ, కొడుకు వచ్చే ఉద్యోగాలన్నిటినీ కాలదన్నుతూ వుండటమూనే వారి సహ నాన్ని దెబ్బ తీశాయనీ గ్రహించగలడు. కానీ, ఏం చేయగలడు?

ఇవన్నీ చూస్తుంటే మనసు బాధతో భగ్గున మండిపోయేది. సంఘం పైనా, డిగ్రీ పైనా, యూనివర్సిటీ ర్యాంకు పైనా గూడా ఎదో తెలియని కసీ, ఉక్రోషమూ కలిగేవి:

"ఎందుకీ ఖర్మ నాకు? ఏ రామానుజం గారినో, మరే బాబాయినో ఆశ్రయిస్తే తక్షణం ఉద్యోగం దొరక్క పోయేదా? ఈ వ్యర్థమైన ఆశయాలు నన్నేం ఉద్ధరిస్తున్నాయి?" అన్పించేది. కానీ, వెంటనే అంతరాత్మ మందలింపు మదిలో మ్రోగేది।

"అందరూ చేస్తున్నారని నువ్వూ తప్పు చేస్తావా? ఇదేనా నీ ఆదర్శ పటిమ? ఇదేనా నీ వ్యక్తిత్వ గరిమ? నీకు ఉద్యోగం రాలేదంటే దానికి అర్థమేమిటి? నీకన్న అర్హులైన వాళ్ళు ఆ ఉద్యోగానికి వచ్చారన్న మాట. మరి, అర్హత లేనిదాన్ని అధికారం ప్రయోగించి పొందటం అమానుషత్వం కాదా?"

మనసు ఎదురు తిరిగేది.

"ఏది అర్హత? ఏమిటి వాళ్ళనుకున్న ఆ అర్హత? మంత్రిగారి బావమరిది కావటమా? లక్షలకు అధికార్లు రావటమా? అదేనా ఉద్యోగానికి కావల్సిన అర్హత?"

"అవును. అది అర్హత కాదని ఒప్పుకుంటూ, మరి అదే అర్హతతో ఉద్యోగం సాధిద్దామని ప్రయత్నిస్తావేం ఒకరి దయా

దాక్షిణ్యాలపై, ధర్మ విధ్వంగా పొందే బ్రతుకుతెరువు నీ ఆత్మవిశ్వాసంపై దెబ్బ తీయదా? ఒకర్ని లోబర్చుకొని పొందే ఉద్యోగం నీ నిజాయితీకి గొడ్డలి పెట్టు కాదా?''

మనసు సిగ్గుతో తలవంచుకొనేది.

'ఎన్నాళ్ళకైనా సరే. స్వయంకృషి తోనే సాధించాలి' అన్న స్థిరనిశ్చయాన్ని మళ్ళీ-మళ్ళీ పునశ్చరణ చేసుకొనేవాడు.

పరిస్థితుల ఉచ్చులు బిగుస్తున్న కొద్దీ ఆశయాల బలిమి మరింత పెరగసాగింది సుందర్రావులో. 'కష్టాల కోర్చుకొన్ననే సుఖాలు దక్కునోయ్ ...పవిత్రమైన ఆశయాల మరువకూడదూ....జయమ్ము నిశ్చయమ్మురా' అని ఏ అదృశ్య వాణో అతణ్ణి ప్రోత్సహించ సాగించె.

* * *

ఆ రోజు ఉదయమే ముఖం కడుగుతు లోపలికి వస్తున్న సుందరానికి, తల్లి దొడ్లో ఎవరితోనో ఘర్షణ పడటం విన్పించింది. 'అందరికీ తలలో నాలుకలా మెలిగే అమ్మ పొరుగు వారితో ఘర్షణ పడటమా' ఆశ్చర్యంగా దొడ్లోకి చూశాడు. గోడ మీదుగా గొంతు చించుకుంటోంది పొరుగింటి మీనాక్షమ్మ. చేతిలో ఖాళీ పేటతో ఇవతలే నిలబడ్డ సుభద్రమ్మ ప్రాధేయ పూర్వకంగా అంటోందేమిటో.

''ఎన్నాళ్ళయిందమ్మా క్రిందటిసారి బియ్యం తీసుకొని? తిరిగి యివ్వనే లేదు. మళ్ళీ మళ్ళీ యివ్వటానికి మాది మాత్రం మధ్యతరగతి సంసారం కాదూ? ధర్మ సత్రమా?'' అరుస్తోందావిడ.

''ఏదో పిన్నీ, ఇదివరకల్లా అడిగానా? మా కష్టాలిలా రాబట్టి గానీ! మా మూడో వాడికేదన్నా ఉద్యోగం దొరికితే ఇక మిమ్మల్నీ మిమ్మల్నీ యిలా విసిగిస్తానా?'' బ్రతిమాలుకొంటున్న సుభద్రమ్మ కంఠంలోని తడి సుందరాన్ని ముంచెత్తింది.

విషయం పూర్తిగా అర్ధమయింది ఇంత విషం మ్రింగుదామనిపించింది. 'ప్రాణాల మీదకు వచ్చినా చేబదుళ్ళకు వెళ్ళని అమ్మ....యీనాడిలా, పరువు కూడా పోగొట్టుకొని పరాయి వాళ్ళతో యిన్ని మాటలు పడుతోంది! ఆవిడ తెచ్చే బియ్యంలో అర్ధ వాటా ఖాళీ చేయటానికి ముఖం కడుక్కొని తను రెడీ: ఛ ...ఛ .. కొండంత కొడుకూ, చెట్టంత మొగుడూ వుండీ అమ్మకిన్ని బాధలా! అప్రయోజకుడైన నావంటి వాడుండటమేగా యిన్ని బాధలకీ కారణం!''

గబగబ గదిలోకి వచ్చి పడ్డాడతను. విపరీతంగా బాధిస్తోంది. తలనొప్పి చిన్నప్పట్నుంచే ఉదయమే అలవాటైన కాఫీ నెల రోజులుగా బంద్ కావటంతో రోజూ కొద్దిగా తలనొప్పి వుంటూనే వుంటోంది. పైగా యిప్పుడు చూసిన దృశ్యం నదీ ప్రవాహాన్ని కలుషితం చేసే బురదనీటిలా మనసంతటినీ కలచి వేసింది.







మరో శరోఘాతం మర్నాడుదయమే తగిలింది. రిటైరయినప్పట్నుంచీ పదకొండు గంటలదాకా భోంచేయని పరంధామయ్యగారు ఆ రోజు తొమ్మిదింటికల్లా అన్నీ ముగించుకుని, బయటకు బయల్దేరటం ఆశ్చర్యం కల్గించింది సుందర్రావుకి. చెల్లెలిని పిలిచి అడిగాడు.

"ఎక్కడకు బయల్దేరారు నాన్న?"

"మన బంగారయ్య కొట్లో అకౌంటు గుమస్తా కావాలట. నాన్న వెళ్తున్నారు."

పిడుగు దెబ్బ తిన్నట్లు కూలిపోయాడు సుందరం.

"అరవయ్యేళ్ళు వస్తున్న నాన్న.... యింకా యీ వయసులో బండచాకిరీతో తమని పోషించటానికి సిద్ధపడ్డారా?

హుఁ....యింత వయసు వచ్చాక, అమ్మ యిరుగు పొరుగు వారిని దేవిరించి తనని మేపుతోంది. ఇన్నేళ్ళు వచ్చిన నాన్న, గొడ్డు చాకిరీతో సంసారాన్ని వెళ్ళదీయటానికి కదిలి వెళ్తున్నారు?"

తన ఆశయాల పరిణామంగా యింత కన్నా ఏం జరగాలో అర్థం కాలేదు సుందర్రావుకు. ఎదురుగుండా గోడ మీద, ఫ్రేములో కులుకుతూ కనపడ్డ డిగ్రీ ఫొటోను తీసి నేలకేసి కొడదామన్పించిందతడికి.

"ఛి ...ఛి....కన్న తండ్రిని, ముసలి తల్లినీ యింత వయసు వచ్చీ పీడించడం, వారిని పోషించటానికి మారుగా వారిపైనే పడి తింటూ కూర్చోవటం ఎంతవరకూ సమంజసం? తన ఆదర్శాలు ఎవరికి అన్నం పెడుతున్నట్లు? తన ఆశయాలు ఎవర్ని ఉద్ధరిస్తున్నట్లు? ఇన్నాళ్ళ తన నిజాయితీకి యీ సంఘం ఏపాటి విలువ నిచ్చినట్లు?"

చూస్తుండగానే ఇన్నేళ్ళు జరిగి పోయాయి డిగ్రీ సంపాదించి. ఏమిటి జరిగిన ఉపకారం? పదివేలు పోసి, సంపాదించిన ఆ ఫస్టుక్లాసు డిగ్రీ ఏపాటి సంపాదించి పెట్టింది? ఎందుకైౖ అహోరాత్రాలు శ్రమించి దాన్ని సాధించినట్లు?"

మూగగా వుండిపోయింది అంతరం, దురుసుగా జవాబిచ్చింది అతడిమనసు:

"దాన్ని ఉపయోగించుకొనే సామర్థ్యం నీకే లేకపోయింది. ఆశయాలూ - ఆచరణలూ అంటూ ప్రాకులాడక మీ నాన్న చెప్పినట్లు విన్నట్లయితే, నీకు ఆ నాడే ఉద్యోగంరాకపోయేదా? నీ చేతకానితనమే —నీ చేతకానితనమే ఇంతకూ కారణం!

ఇకనైనా మేలుకో! నలుగురూ నడిచిన త్రోవనే నీ పయనమూ సాగించు, ఈ శతాబ్దిలో ఎవ్వరూ అవినీతివి కాదనటానికి వీల్లేదు. ఈ యుగంలో ఎవరికీ ఆదర్శాలంటూ అర్రులుచాచే అవకాశం లేదు. ఇది ఆశలయుగమే! ఆశయాల యుగంకాదు....ఆశయాలయుగం కాదు!"

"ఔను!........కాదు." స్థిరనిర్ణయం నెలకొందతనిలో.

అతడి నంతవరకూ ధర్మబద్ధంగా వుంచిన ఆశయాల సంకెళ్ళు ఒక్కసారిగా తెగి నేలన పడిపోయాయి-ఆర్తనాదంలాటి చప్పుడు చేస్తూ! అన్ని సందర్భాలలోనూ అధర్మమే అంతస్థుకుచేరుకుందిఅట్టహాసం చేస్తూ!

పరుగులాటి నడకతో పరంధామయ్య గారిని సమీపించాడు సుందర్రావు,

"ఆగండి నాన్నా, మీ రీ ఉద్యోగానికి వెళ్ళటానికి వీల్లేదు. ఇంకా మీ రక్తాన్ని రూపాయలుగా మార్చి పోషించ నక్కర్లేదు. చివరకు యీ స్థితి లోకూడా మిమ్మల్ని పోషించలేని నేను. యింకా గ్రుడ్డిగా ఆశయాల కలల గాజుమేడల్లో ఆనందంగా ఆత్మవంచన చేసుకుంటూ జీవించలేను! ఈ సమాజాన్ని యీ నాటికైనా సరిగ్గా అర్థంచేసుకోగల్గాను, నా కర్తవ్యమేమిటో నాకు బాగా తెల్సివచ్చింది,

ఇవాళే బాబాయికి ఉత్తరం వ్రాయండి, ఆయన యిప్పించే ఏ ఉద్యోగంలోనైనా చేరటానికి నేను సిద్ధం!"

ఊహించని ఈ మార్పుకు ఆశ్చర్య పోతూ అయోమయంగా నిలబడి పోయారు ఆయన,

మర్నాడే ఉత్తరం వ్రాయటం, మరో పదిరోజుల్లో జవాబు రావటంకూడా జరిగి.

పోయాయి.

"ఇన్నాళ్ళకయినా నీకు బుద్ధి కుదిరి నందుకు సంతోషం.... మే మంటూ ఉన్నా మని గుర్తుకు వచ్చిందన్న మాట...." అంటూ దెప్పిపొడుస్తూ ఉన్న ఆ ఉత్త రంలోని భావాన్నంతటినీ హాలాహాలంలా మ్రింగి, అప్లికేషన్ పూర్తి చేసిపంపాడు సుందర్రావు.

నెల తిరక్కుండానే, ఉద్యోగంకోసం యింటర్వ్యూ వచ్చింది. అది నామ మాత్రమే కాబట్టి, మరో పదిహేను రోజు లకే ఆర్డర్లూ వచ్చాయి.

* * *

'అమ్మయ్య, ఇన్నాళ్ళకి మన కష్టాలు తీరేయండి! అనుకున్న ప్రకారం ఉద్యోగం యిప్పించాడా వడ్డికాసుల వాడు!

ఆర్డరు కాగితాలు వచ్చాయి.

ఆనందంగా అంటున్న సుభద్రమ్మ గొంతు ఒక్కసారి వాస్తవంలో పడేసింది సుందర్రావుని.

హుఁ! ఎంత పిచ్చిదానివమ్మా! తిర పతి దేవుడేం చేశాడమ్మా ఉద్యోగం రావ టానికి. తిరుగులేని బాబాయి ప ర ప తి చేసిందిగాపి!" అనుకున్నాడు మనసు లోనే.

ఎంత చల్లటివార్త చెప్పేవు సుభద్రా! మన సుందరానికీ ఉద్యోగం వచ్చిందన్న మాట" ఆనందంతో పాటూ, బరువు తీర్చుకున్న భావంకూడా తొంగిచూసింది పరంధామయ్యగారి కంఠంలో.

"నువ్వు పొర బడ్డావు నాన్నా! ఉద్యోగం రాలేదు. మనమే తెచ్చుకున్నాం! అయినా, అంత పలుకుబడి, అవినీతి ప్రయోగించిన తర్వాతగూడా రాకుండా ఎక్కడికి పోతుంది?"

"ఇన్నాళ్ళకైనా మీ వాడు ప్రయోజకు డయ్యా డన్నమాట!" నాన్నగారితోటే వచ్చిన ఎవరో మిత్రుడి మాటలకు నవ్వాలో, ఏడవాలో అర్థంకాలేదు సుంద ర్రావ్‌కి.

"ఒకనాడు....'ఆశయాలకై అర్రులు చాచిన నాడు....ఎవరికీ, ఎందుకూ పనికి రాని చవటని! నీతిని నమ్మకు, నిజాయి తీగా నిలబడ్డనాడు పట్టెడన్నానికి కొరగా ప్ర యోజకుణ్ణి! మరి నేడు? స్వార్థంతో సర్వాన్నీ జయించి, అవినీతితో అక్ర మంగా నడిచిననేడు.....అందరిలో గొప్ప ప్రయోజకుణ్ణి! ఏం సమాజం ఇది! ఇలా ఉంటే యిక ఎప్పటికి బాగుపడుతుంది? అస లేనాటికైనా బాగుపడుతుందా?"

అసహ్యంతో నిండిపోయిన మన సుతో, ఆ కవర్నీ, బుట్టలోంచి తొంగి చూస్తున్న విషనాగుల్లా వున్న ఆర్డర్ కాగి తాల్నీ నిస్త్రాణంగా బల్లమీదే పడేసి, వెనక్కి వాలిపోయాడు సుందర్రావు.

# రాకాసి శిఖరాలు

(గత సంచిక తరువాయి)

అదీ నా బాధ। నేను కావాలని మీతో ఫోన్ చేయించానని అనుకుంటుం దేమో।

"ఎంత మెత్తదానివి నువ్వు। మరీ యింత మొహమాటం అయితే యీ ప్రపంచంలో బ్రతకడం చాలా కష్టం.

"ఏమో। నా ప్రపంచమంతా అత్తయ్యా చుట్టూ రానేవుంటుంది. అలాటి కష్టం నా కెప్పుడూ అనుభవంలోకి రాలేదు."

నాకు తెలియకుండానే దీర్ఘంగా శ్వాస తీసుకుని వదిలాను.

"నువ్వు చాలా అదృష్టవంతురాలివి సత్యా। నీకు హాస్పిటలూ - మీ అత్తయ్యా తప్ప మరో ప్రపంచమే తెలియదు నేను చూస్తూనే వున్నాను కదా। నీ స్నేహితు రాళ్లు వున్నారంటే వాళ్లు నీ దగ్గరికి రావటం తప్పితే నువ్వు వాళ్ళ దగ్గరకి వెళ్ళటం నే నెన్నడూ ఎరగను. సహ జంగా నీ వయసులో వుండేవాళ్ళకి వుండా ల్సిన సరదా లేవీ నీకు లేవు. ఒక్క మీ అత్తయ్యని మినహాయిస్తే మిగతా మీ వాళ్ళందరితోనూ, నీ సంబంధ బాంధ వ్యాలు అంతంతమాత్రంగానే వున్నాయి. సత్యా। నువ్వు బలవంతంగా గీసుకున్న యీ గిరినుంచి ఒక్కసారి యివతలికి లాక్కురావాలని అనిపిస్తుంది. సుభద్రమ్మ గారికి యిష్టం వున్నా, లేకపోయినా ఆ చనువు, అధికారం నే నెప్పుడూ సంపా యించుకుంటాను."

"ఇప్పుడు మీరు చేసినపని అదికాదా,"

"అదేఅని నువ్వు ఒప్పుకుంటే, యీ పని తరచూ చేస్తాను."

ఇంతలో టపటప పెద్దపెద్ద చినుకులు పడడం ప్రారంభించినాయి. నా దృష్టిని రోడ్డుమీదకి ఏకాగ్రతతో లగ్నం చేశాను. చూస్తూండగానే వాన పెద్దదైంది. తదే కంగా రోడ్డువైపు చూస్తున్న నాకు ఎంత సేపు డ్రైవ్‌చేసినా మాష్టరుగారు చెప్పిన కొండ గుర్తులు ఎదురవలేదు.

సీరియల్

"దారి తప్పినట్టున్నాం!" అన్నాను.

"నా కేం భయంలేదు. నన్ను జాగ్రత్తగా యింటికి తీసుకొచ్చే బాధ్యత మీదని అత్తయ్యకి వాగ్దానం యిచ్చారు మీరు. సత్య ఆ మాటలు తాపీగా అన్నట్లుగా అంది.

"చేసినవాగ్దానం మర్చిపోవటం,ఇచ్చిన మాట తప్పడం నా కెప్పుడూ అలవాటు లేదు" సీరియస్‌గా అన్నాను.

ఆ తర్వాత మా మధ్య అంతగా మాటలు జరగలేదు. క్షణక్షణానికి వాన జల్లు పెద్దది కాసాగింది. చూస్తూండగానే కుండపోతగా మారింది. నేను నా ముందు కన్పిస్తున్న దోవ వెంబడి జాగ్రత్తగా జీప్‌ని పోనివ్వసాగాను. దారి మెలికలు, మెలికలుగా వుంది.

జీప్‌ని తదేకధ్యానంతో డ్రైవ్‌చేస్తున్న నేను వున్నట్టుండి 'మై గాడ్!' అన్నాను.

'ఏమిటది?' అంది సత్య ఖంగారుగా.

"మనం తిరిగి తిరిగి ఎక్కడికి వచ్చామో చూడు!" అన్నాను. జీప్‌కి బ్రేక్ వేసి ఆపాను. సత్య ముందుకు వంగి పరీక్షగా చూసింది. మా ఎదురుగా నీరు ధారలుగా, మెలికలుగా జారిపోతున్న జీప్ అద్దంతో నుంచి శిథిలమైన కోట మమ్మల్ని చూసి వెక్కిరిస్తున్నట్టుగా నిలబడివుంది.

అప్రయత్నంగా సత్యా - నేను ముఖాలు చూసుకున్నాం.

'వచ్చాం! మనం బైలుదేరిన చోటికి తిరిగివచ్చామా! యిప్పుడేం చేయటం?' సత్య విస్మయంగా అంది.

"చేసే దేముంది! వర్షం వెలిసేటంత వరకూ వెయిట్ చేయడమే!"

"యిక్కడా!"

"యింతకంటే యింకో మార్గంలేదు. ఈ వానలో తిరుగుతూ వుంటే యింత

యద్దనపూడి సులోచనారాణి

క్రితం పెట్రోలు అయిపోయిందన్న శోక ఏ క్షణంలోనైనా నిజంఅయే ప్రమాదం వుంది." సత్యని దిగమన్నాను.

"దిగటం ఎందుకు?"

"ఈ వాన ఎప్పుడు తగ్గుతుందో ఎవరికి తెలుసు! యిందులో కూర్చుని తపస్సు చేసేకంటే, దిగివెళ్ళి అక్కడ తలదాచుకోవడం మంచిది."

సత్య అట్టే అభ్యంతరం చెప్పలేదు.

ఇద్దరం దిగి ఎదురుగా, వరండాలా వున్న కోట ముందరిభాగంలోకి వెళ్ళి నిలబడ్డాం! ఇంతక్రితం ఎంత ప్రశాంతంగా, ఆహ్లాదంగా వున్న ఆ పరిసరాలు, యీ

కాస్తలోనే వురుములతో, మెరుపులతో, యింత భీభత్సంగా తయారవటం చూస్తే వృష్టి తన ప్రతాపాన్ని చూపిస్తున్నట్టే వుంది. జీప్‌లైట్ల వెలుతురులో నీటిధారలు వూసలతోరణాల్లా మెరుస్తున్నాయి. వేయి ఏనుగులు తొండాలెత్తి నీటిధారలు ఒక్కసారిగా వదులుతున్నట్టుగా వుంది.

"ఛీ, ఛీ! అందుకే మాటవరసకికూడా అశుభాలు పలకకూడదంటారు. యిక్కడే వుండాలని నే నన్నమాట యింత నిజం అవుతుందని నే ననుకో లేదు." సత్య తనని తాను నిందించుకున్నట్టుగా అంది.

ఇంతలో ఆకాశంలో మేఘాలు గర్జిస్తున్నట్టు ఫెళఫెళమన్నాయి. ఆ వెంటనే దిక్కులు పిక్కటిల్లేటట్టు శబ్దంచేస్తూ దూరంగా ఎక్కడో పిడుగుపడింది. సత్య అప్రయత్నంగా నా దగ్గరగా వచ్చి నా మోచేతిమీద గట్టిగా పట్టుకుంది.

"ఏం? భయంవేస్తోందా?" సత్యమీద చెయ్యి ఆనిస్తూ అడిగాను.

"ఊహు!" లేదన్నట్టు తల అడ్డంగా తిప్పింది.

"పెద్దవాళ్లు వూరికే చెప్పలేదు. ఆడవాళ్ల అబద్ధం అడుగడుగునా అతివతురులు అని."

సత్య చురుగ్గా తలెత్తి చూసింది. ఆ కళ్ళలో భయం స్పష్టంగా కనిపిస్తోంది. నాకు సత్యనిచూస్తే హఠాత్తుగా జాలి వేసింది. క్షణంక్రితం దారి తప్పాం 'అన గానే 'నా కేం భయం' అని కోపంతో ధీమాగా అన్న సత్య యిప్పుడు నిజంగానే భయపడుతోంది. నాకూ కూడా భయంగానే వుంది. కానీ నా భయం వేరు. యీరాత్రి వేళ నాకు దారి సరిగ్గా మళ్లీ దొరుకుతుందా! జీప్ ట్రబుల్ యివ్వదుకదా! దోవలో పెట్రోలు అయిపోదుకదా! ఈ రాత్రి యింటికి వెళ్ళకపోతే సుభద్రమ్మగారికి నే నేమని జవాబు చెప్పగలను! జరిగింది జరిగినట్టు చెబితే ఆవిడ నమ్ముతుందా! నా ఆలోచనలు, ఇలా పరుగిడ సాగాయి. ఆకాశంలో మేఘాలు మళ్ళీ గర్జిస్తున్నాయి. వుండివుండి కళ్ళు మిరుమిట్లు గొలిపేట్టు మెరుపులు మెరుస్తున్నాయి. మేఘాల గర్జనలకి ఆ పరిసరాలన్నీ వూగిసలాడుతున్నట్టు ప్రతిధ్వనించ సాగినాయి.

సత్య నా చెయి వదలలేదు. నేను సత్యకి ధైర్యం చెబుతున్నట్టుగా భుజాలు చుట్టూ చేయివేసి పొదవి పట్టుకున్నాను. సత్యని మెల్లగా హాస్పిటల్ కబుర్లలోకి దించాను. రోగులు, రోగాలు, వైద్యులు, వైద్యం వీటిమీదకి సంభాషణ తప్పేసరికి మాకు తెలియకుండానే టైమ్ గడిచిపోయింది. కబుర్లలోపడితే కాలం తెలియదన్న పరమసత్యం ఋజువైంది.

వాన క్రమంగా తగ్గింది. అంత ఉధృతంగా కారుచీకటిలా కమ్ముకు వచ్చిన మబ్బులు అంతలోనే విడిపోయి దూది




పింజల్లా తేలిపోయినాయి. ఆకాశంలో చంద్రోదయమైంది. అది చూడగానే నాకు నగంప్రాణం లేచివచ్చింది. వాన పూర్తిగా తగ్గిపోయింది. ఎక్కడనుంచో వస్తున్న నీటి ప్రవాహం మా ముందునుంచి గల గల శబ్దంచేస్తూ వేగంగా తరలిపోతోంది. మళ్ళీ నిశ్శబ్దంగా అయిపోయిన ఆ పరి సరాల్లో శబ్దంచేసుకుంటూ వెళ్ళిపోతున్న ఆ నీటిధ్వని చెవులకి విన సొంపుగా, తమాషాగా వుంది.

వరండాలోనుంచి నేను కాలు జాచి అంగవేసి ముందుగా దిగాను. నా పాదాలు మునిగి కొస్త పైవరకూ నీళ్ళు వచ్చాయి. క్రిందకి దిగిన నేను చేతులుజాచి సత్యకి అందించాను. వరండా దిగువన కొంచం లోతు వుండడంవల్ల వరవడి ఎక్కువగా వుంది. సత్య నా బుజాలమీద చేతులు ఆనించింది. నా చేతులు సత్య నడుంమీద ఆనాయి. నేను దాదాపుగా సత్యని నడుం దగ్గర పట్టి నేనున్నచోటుకి దింపాను. సత్య నా భుజాలని గుచ్చి పట్టుకోవడంతో ఆ స్పర్శ నాకు గిలిగింతలు పెట్టినట్ట యింది, సత్యముఖం నా దగ్గరగా వచ్చి దూరం కావడంతో ఒక్క క్షణం నన్ను నేను మర్చిపోయాను. వున్నట్టుండి సత్య ముఖం దగ్గరకు లాక్కున్నాను. సత్య వేగంగా ముఖం తిప్పేసుకుంది. నా పెద వులు సత్య చెంపమీద ఆనాయి.

సత్యముఖం బలవంతంగా నాకు అభి ముఖంగా తిప్పుకున్నాను. ఆ క్షణంలో సృష్టి యావత్తూ మేం యిద్దరమే అయి నట్టుగా అనిపించింది. ఐదు నిమిషాల తర్వాత సత్యని మెల్లగా వదిలేశాను. ఆ ఐదు నిమిషాల్లో ఐదు యుగాల అనుభవం కలిగింది నాకు,

మళ్ళీ కోటదగ్గర నుంచి బైలుదేర

# జరిగిన కథ

అసలు ఎక్కడా ఉద్యోగం రాకపోవడం, వచ్చినా అది నిలువక పోవడం నాకు పరిపాటి అయింది. ఓ యింటర్వ్యూలో గోపాలంతో పరిచయం ఏర్పడింది. అతనికి సుస్తీ చేయటంతో అతని డ్యూటీ నేను చేపట్టటం విధి నిర్వహణంలో దొంగగా ఊహించబడ్డాను.

బాబాయి ఉత్తరానికి సమాధానంగా వివాహం చేసుకోనని, అతని అప్పు తీర్చలేనని వ్రాసాను. గోపాలంవలన సినిమా హాలు గేటు కీపరుగా చేరి తలవని తలంపుగా పాత స్నేహితురాలు శాంతిని చూసాను. ఒక్కసారి గతమంతా గుర్తుకు వచ్చింది.

తరువాత జ్వాలాముఖిలో ఉద్యోగం దొరికింది. శాంతి వాళ్ళ ఫ్యాక్టరీలో మేనేజరుగా జేరమంది. నేను చేరకుండా ఆ జాబ్ గోపాలానికి యిప్పించాను. పత్రిక అభివృద్ధి కోసం పాటుపడ సాగాను. పరిస్థితుల ప్రాబల్యంవలన పత్రికలో భాగస్వామి అయ్యాను.

కుసుమను ఆత్మహత్యా ప్రయత్నం నుంచి రక్షించి లైబ్రరీ గుమాస్తాగా చేర్పించాను. సుభద్రమ్మగారు తమ చనిపోయిన కొడుకు పోలికలు నీలో ఉన్నాయి అన్నారు. నా కృషికి ఫలితంగా పత్రిక అభివృద్ధి చెందుతోంది ఈ మధ్య.

గోపాలం ప్రవర్తనలో మార్పు వచ్చింది. ఇంతలో పిడుగులా "సుదర్శనంగారు మరణించారు" అన్న వార్త నా మనసును కలచివేసింది. పత్రిక సర్వాధికారాలు నా చేతికి వచ్చాయి.

సత్యను పెళ్ళికి ఒప్పించమని సుభద్రమ్మగారు నన్ను కోరారు. కాని నా ప్రయత్నమేమి ఫలించలేదు. మా ఆఫీసు మరొక చోటుకు మార్చి 'పార్టీ' ఇచ్చాను. గోపాలం నాతో ముభావంగా ఉండటానికి కారణం శాంతి అని తెలిసి అతన్ని హెచ్చరించాను. బిల్లజాతులవారి గురించి పత్రికలో వ్రాయుటకు ఊరు వెళ్ళవలసి వచ్చింది. అనుకోని విధంగా సత్యతో కలిసి వెళ్ళాను. అక్కడ దగ్గరలో కోట ఉందని తెలిసి కోటకి వెళ్ళాము.



టంతో, యీ సారి మాష్టరుగారు చెప్పిన గుర్తులు జాగ్రత్తగా చూసుకుంటూ రావటంతో త్వరగా మెయిన్‌రోడ్డు దగ్గరికి రాగలిగాం. దోవ పొడుగునా సత్య ఏం మాట్లాడలేదు చలనం లేని బొమ్మలా కూర్చుండిపోయింది.

"కోపం వచ్చిందా నా మీద?" మృదువుగా అడిగాను.

సత్య మాట్లాడలేదు. నేను చేయిజాచి సత్యచేతిని నా చేతిలోకి తీసుకున్నాను. సత్య సంతోషించలేదు. తిరస్కరించనూ లేదు.

''ఏదయినా మాట్లాడు.''

ఏం మాట్లాడను.''

''ఏదో ఒకటి.''

''మీరు తొందరపడ్డారని ఒప్పుకోండి. నా పశ్చాత్తాపభారం సగం అయినా తగ్గుతుంది.''

నేను తలతిప్పి సత్యవైపు చూడాలని అనుకున్నాను. కాని రోడ్డుమీద ఎదురుగా గుంటలు కనిపించడంతో ఆ పని చేయలేక పోయాను.

''నిజం చెప్పమంటావా? జరిగినదానికి నేనేం బాధపడటం లేదు. ఆ సమయంలో అది నాకెంతో సహజంగా కన్పిస్తోంది.''

సత్య నిట్టూర్పు విడిచింది.

మిమ్మల్ననవలసిన పనిలేదు. తప్పంతా నాదే! మీరడగగానే ఎలాటి అభ్యంతరం చెప్పకుండా మీ వెంట ప్రయాణం అయి వచ్చానంటే ఆ మాలిన్య మేదో నా మనసులోనే వుండివుండాలి.''

''దాన్ని మాలిన్యం అంటున్నావా?''

''కాకపోతే యింకేమిటి? మనిషి మాటకి విలువలేదా! ఒకరికి నిండు మనసుతో వాగ్దానం యిచ్చినతర్వాత, అది నిలబెట్టుకోలేని వారిని మీరు గౌరవిస్తారా?''

''అందరిసంగతి వేరు. నా సంగతి వేరు. సత్యా! జరిగిందానికి నేను బాధపడటం లేదు. అంతేకాదు. నిన్ను బాధపడనివ్వను కూడా! ప్రసాద్ జ్ఞాపకాలని నువ్వు మర్చిపోవలసిందిగా నేను కోరడం లేదు. కాని వాటితో జీవన్మృతురాలిలా, నిస్సంగురాలిలా బ్రతకడం మాత్రం నేను భరించలేను.''

''మీ రీ ప్రసంగం ఎత్తితే నే నిప్పుడే దిగిపోతాను.'' సత్య దిగబోయింది.

''దిగిపో! నాకేం అభ్యంతరం లేదు'' నేను వారించలేదు.

పైనుంచి జీప్‌కి బ్రేక్ వేసి ఆపాను కూడా.

సత్య దిగలేదు. రాయిలా చలనం లేకుండా కూర్చుంది.

సత్య మనసు నొప్పించాలని కాని, ఆమెని కించపరచాలన్నది కాని నా ఉద్దేశ్యం కానేకాదు.

నేను కాస్త దగ్గరగా జరిగాను. సత్య భుజాలు పట్టి ఒళ్లోకి లాక్కున్నాను.

అప్పటివరకూ నిగ్రహించుకుంటున్న ఏడుపు యిక సాధ్యంకానట్టు ఒక్కసారి ఏడవ సాగింది సత్య. తల నిమురుతూ మృదుగంభీర స్వరంతో, అనునయంగా అన్నాను. ''చూడు సత్యా! అసలు గౌరీశంకర్ వచ్చి రానని చెప్పేవరకూ నేను యీ వూరు వద్దామని అనుకోలేదు. తీరా బైలుదేరుతుండగా నువ్వు వచ్చావు. నిన్ను నా వెంట తీసుకురావడం కూడా అనుకోనిపనే! తీరా యిక్కడకి వచ్చిన తర్వాత యీ కోట చూడాలని అనుకో

వడం. ఆ కోట దగ్గరకి వెళ్ళడం. వాన రావడం, దారి తప్పడం. చూశావా! ఒక్క రోజులో ఎన్ని అనుకోని పనులు మనకి తెలియకుండానే జరిగిపోయాయో! జీవితం కూడా అంతే. ఏవేవో అనుకుంటాం! ఎన్నెన్నో చేయాలని వూహిస్తాం. కానీ ఏ ఒక్కటి జరగదు. కానీ అనుకోకుండా మనం కొన్ని చేసేస్తాం.

దాన్నే 'విధి' అని అంటారేమో! మనిషి వీరేదేన్నయినా తప్పించుకోగల దేమో కానీ యీ విధిని మాత్రం తప్పించుకోలేడు. నువ్వెప్పుడో ప్రసాద్‌కి మాట యిచ్చిన మాట నిజమే! అతను బతికి వుంటే మనస్పూర్తిగా ఆ మాట నిలబెట్టుకునే వానివి కూడా! కానీ ప్రసాద్ లేడు. అతను లేకుండా పోయి కొన్ని సంవత్సరాలు అవుతోంది! ఇంకా ఏ నియమ పాలన ఎవరి కోసం, ఎవరివి సంతోష పెట్టడం కోసం నువ్విలా నీ జీవితం ~ ట్టి పాలు చేసుకుంటానంటున్నావు. చెప్పు సత్యా! మాట్లాడు! మాట్లాడవేం?

"ఇంటికి వెళదాం!" బొంగురు పోయిన కంఠంతో మెల్లగా అంది.

"అంతేనా! నా ప్రశ్నకి సమాధానం ఏం లేదన్న మాట!"

"నే నిప్పుడేం చెప్పలేను. నా కసలు ఆలోచించే శక్తి లేకుండా పోయింది."

నేను సత్యని మెల్లగా వదిలేశాను. జీప్ స్టార్ట్ చేసి వేగం హెచ్చించాను. నా మనసంతా అనంతతృప్తిగా, చిరాకుగా అయిపోయింది. ఇంత క్రితం కోట దగ్గర నేను నిముషాలు, యుగాలుగా పొందిన అనుభూతి సత్యకి కలగలేదంటే నా కెలాగో అనిపించసాగింది.

* * *

పై సంఘటన తర్వాత దాదాపు నెల రోజులు గడిచినాయి. ఈ నెల రోజులలో నేను మళ్ళ సత్యని కలవలేదు. ఆ రోజు రాత్రి పొద్దు పోయిన తర్వాత. సత్యని సుభద్రమ్మ గారింట్లో దింపి, మేం దారి తప్పిన వైనం క్లుప్తంగా చెప్పి యింటికి వచ్చేశాను. నేను వచ్చే ముందు సత్యని మరోసారి చూడాలనిపించింది. కానీ సత్య బైటకి రాలేదు.

ఆ మర్నాడే అర్జెంట్ పని మీద బొంబాయి వెళ్ళాల్సి వచ్చిన నేను పది రోజుల తర్వాతగాని తిరిగి రాలేదు పత్రిక సర్క్యులేషన్ రాకెట్ వేగంతో పెరుగుతోంది సేల్స్ పెరిగినకొద్దీ నా బాధ్యతలు రెట్టింపు అవుతున్నాయి. పని వత్తిడి ఎక్కువ కాసాగింది ఇదివరకు ఎంత పనివున్నా రాత్రి 11 గం. లోపల నిద్ర పోయేవాడిని. ఉదయం 6 గం. లేచి వ్యాయామం చేసేవాడిని. ఇప్పుడు రాత్రి 1 గం. అయినా తీరడం లేదు. ఏ రోజు కా రోజే పని మధ్యలో అపవచ్చి మంచం మీద వాలిపోవటం జరుగుతోంది.

నేను బొంబేనుంచి వచ్చిన నాలుగు

రోజులకి కుసుమ వచ్చింది. నేను ఆఫీసు గదిలో పని తొందరలో వున్నాను.

సూర్యం వచ్చి "ఆ అమ్మాయి వచ్చింది సార్!" అన్నాడు.

"ఏ అమ్మాయి?" అన్నాను.

సూర్యం పేరు చెప్పకుండానే బైటకి వెళ్ళిపోయాడు.

కుసుమ లోపలికి వచ్చింది. తల వంచుకుని వచ్చి గదిలో ఓ పక్కగా నిల బడింది.

"ఏమిటి?" అన్నాను.

కుసుమ తటపటాయిస్తున్నట్టు నావైపు చూసింది.

"డబ్బేనా?"

'అవున'న్నట్టు తల వూపింది.

డ్రాయర్‌లోంచి మొత్తం తీసి చేతికి యిచ్చాను.

"నువ్వు మెట్రిక్‌కి కట్టడం ఏమైంది?"

"ట్యుటోరియల్ కాలేజి వివరాలు కను క్కున్నాను. రేపు వెళ్ళి జాయినవుతాను."

కుసుమకి ఏదయినా ఆహారం దొరికే టంతవరకూ నేను చేయూత యివ్వటానికి సిద్ధంగా వున్నాను. కానీ ఆజన్మాంతం కుసుమ కుటుంబ భారం నా మెడ మీద మోయటానికి మాత్రం సిద్ధంగా లేను. ఆ రోజు 'సీకే అవసరం వచ్చినా నే నున్నాను' అని హామీ యిచ్చాను. కుసుమ ఆ మాట పట్టుకుని చీటికి మాటికి నా దగ్గరికి డబ్బుకోసం రాసాగింది నాకిది చిరాకుగా అనిపించినా ఆ అమాయకురాలి మీద అది కన్పరచలేక పోయాను కుసుమకి అడపా తడపా పాతిక-యాభై యివ్వటం నాకేం కష్టమైన పని కాదు. కానీ యిది అలవాటుగా మాత్రం మారకూడదు. దాని వల్ల చాలా యిబ్బందులున్నాయి. అందుకే క్రితం సారి కుసుమ డబ్బు కోసం వచ్చి నప్పుడు మెట్రిక్‌కి కట్టమని ప్రోత్సాహిం చాను. కుసుమ ఆ మాట వినగానే వుత్సా హంగా చూసింది.

మెట్రిక్ పాసయి, ఏ టైపో నేర్చు కుంటే, ఆ అమ్మాయి అ సంసారభారాన్ని నిశ్చితంగా మోయగలదు.

"క్లబ్‌లో లైబ్రేరియన్‌గా ఎందుకు మానేశావు?" అని అడిగితే - "అక్కడి వాళ్ళు నాకు నచ్చలేదు" అంది.

"నచ్చకపోవటం ఏమిటి?" విచిత్రంగా చూశాను.

"వాళ్ళంతా ఉన్నవాళ్లు!" తల దించు కుని అంది

"ఉన్నవాళ్ళా! అందుకని మానేశావా! మనపాటి వాళ్ళలోకే వుద్యోగం దొరకా లంటే ఎంతమంది వుద్యోగాలు చేయగల రంటాను? అసలు ఆ సామ్యం నీకెందుకు? ఈ ప్రపంచంలో అందరికీ అన్నీ నచ్చిన వుద్యోగాలే చేస్తున్నారంటున్నావా? తెల్ల వారి లేచిన తర్వాత మన చుట్టూ ఎన్నో నచ్చని విషయాలు జరుగుతూ వుంటాయి. మనకి యిబ్బంది లేనంతవరకూ చూసీ చూడనట్టు వెళ్ళిపోవాలి. సుభద్రమ్మగారితో నేను మాట్లాడుతాను. మళ్ళీ వెళ్ళి చేరు తావా?"

(సశేషం)




ఆదివారం సాయంత్రం ఐదు గంటలకంతా వంట ముగించి, భర్తకు చపాతీలకు గాను పిండి కలిపి గిన్నెలో పెట్టి మూత వుంచింది సీత. పిల్లలను ముస్తాబు చేసి తనూ తయారయింది. ప్రొద్దుట ప్రక్కింటి కామాక్షి సాయంత్రం సినిమా కెళ్దామని కబురు చేసింది. అది ఆఖరు రోజనీ, సినిమా చాలా బాగుంటుందనీ, తను మూడో మారు చూస్తున్నాననీ, తప్పక రమ్మని మరీమరీ చెప్పి పంపింది. సీతకు కూడ వెళ్దామనే వుంది కాని భర్త ఏమంటాడోనని బెదురుగ వుంది. ప్రొద్దుటే అడిగి నిరాశ చెందటమెందుకని పనంతా ముగించుకొని ఆఖరు క్షణంలో అడగటానికి సిద్ధమయింది.

ముందు గదిలో పేపరు చదువుకొంటున్న భర్త దగ్గరికి వెళ్ళింది. ఎలా ప్రారంభించాలో తెలియలేదు. చిన్నగ దగ్గి చూసినా, ప్రయోజనం లేకపోయింది.

"ఏమండీ!"

"ఊ ...ఏమిటి?" పేపరులో నుండి మొహం బయటికి పెట్టి అడిగాడు.

''మరే.... కామాక్షి వాళ్ళు సినిమాకు వెళ్తున్నారట ''

''అయితే నన్నేం చేయమంటావ్? వారిని దిగబెట్టి రమ్మంటావా?''

"అది కాదండీ . నన్ను కూడ రమ్మన్నారు. పిల్లలు కూడ సరదా పడ్తున్నారు. వారికి ఇవాళ సెలవు కూడాను."

''ఓ . హో... ఆదివారం సెలవని నాకు క్రొత్తగ చెబుతున్నావే? ఏ సినిమా పిచ్చి వారికి కూడ నేర్పేట్టున్నావ్.... శుభ్రంగ ఇంటిపట్టు నుండక సినిమా అట—సినిమా!''

''ఈ సినిమా చాలా బాగుందని... అందరూ చెబుతున్నారు. పైగా 25 వారాలుగా ఆడుతోంది.''

''మాటకు మాట సమాధానం చెబుతున్నావ్ మతి గానీ పోయిందా ఏమిటి? వద్దంటుంటుంటే నీక్కాదూ? ఏమున్నాయి సినిమాలలో? కౌగిలింతలూ, ప్రేమ పాటలు, ప్రేమ సన్నివేశాలూ! అవి చూసి ఈ బుద్ధిలేని ఆడవారు తమ భర్తలు అలా వుండటం లేదని వాపోవటం.''

''ఇదలాంటి ప్రేమ కథ కాదని చెప్పారండి.''

''అందుకే అన్నారు పెద్దలు ఎవరి హద్దుల్లో వారి నుంచాలని. లేకపోతే ఇదిగో! ఇలానే ధైర్యంగా సమాధానాలు చెబుతారు.''

''అది కాదండి. కామాక్షి రమ్మని మరీ మరీ చెప్పింది. మేము పనులన్నీ ముగించుకొన్నాం.పిల్లలుకూడతయారు!'' భయంగా చెప్పుకుపోతూ వుంది సీత.

''యూ....రాస్కెల్! ఎంత సాహసం నీకు! వద్దని చెబుతుంటే మరీ మరీ విసిగిస్తావే? నాకు తెలీదా? ఎప్పుడు ఏ సినిమాకు మిమ్మల్ని పంపాలో! ఇంట్లో నన్ను ఓ క్షణం వుండనిచ్చేట్టు లేదు నీవు. ఇవాళ క్లబ్ నుండి సినిమాకు వెళ్ళి పది గంటలకొస్తాను. రోజులాగ 9 గంటలకు కాల్చకు రొట్టెలు. నేను వచ్చిన తర్వాత వేడిగా చెయ్'' అని ఆర్డర్ ఇచ్చి పేపరు సీత, ముఖాన కొట్టి విసురుగా వెళ్ళిపోయాడు రామారావ్ నామధేయుడూ, రావణాసుర ప్రవర్తనుడూ అయిన సీత భర్త.

భర్త కఠిన మనస్తత్వానికి సీత కళ్ళలో నీరు ఎప్పుడో ఇంకిపోయాయి. సినిమాకు రావటం లేదని పిల్లలతో కామాక్షికి కబురు చేసి, పిల్లల చేతుల్లో నాలుగు బిళ్ళలు పెట్టి వాళ్ళను ఆటకు పంపించింది. ఇంట్లో చేసే పనేమి లేక హాల్లో జాజిపందిరి క్రింద కూచొని తన మెతకతనానికి చింతిల్లసాగింది. తనెందుకిలా పిరికిగా తయారయింది! తనిప్పుడు సినిమాకెళ్తే

ఏం చేయగలదు భర్త? నాలుగు తన్ని నోటికొచ్చిన తిట్లు ఏకరువు బెట్తాడు. అంతేగా! దానికి తను భయపడట మెందుకు? తనకివేవీ క్రొత్త కాదే! ... చిన్నప్పటినుండి సవతితల్లితో, పెళ్ళయిన కొన్నేళ్ళు అత్తా, ఆడబిడ్డలతో! ఇప్పుడు భర్తతో! అలవాటయిన దెబ్బలూ! తిట్లు! మరెందుకు ముందంజ వేయలేకపోతోంది? ఒకవేళ మెడపట్టి గెంటేస్తే, పుట్టింట్లో సవతితల్లి పోరపి భయమా? తను బట్టలు కుట్టి,నాలుగు ప్రైవేట్లు చెప్పుకొని బ్రతక గలదు, తను పెరిగిన వాతావరణ ప్రభావం వల్ల తెగించే ధైర్యసాహసాలు లేవు. పిరికితనం నానాటికీ తనలో పెరుగు తోంది.హింసామూర్తి అయిన సవతితల్లి, దయావిహీనులైన అత్తా, ఆడబిడ్డలు; కఠినుడూ, కోపిష్టి అయిన భర్త! ... వీరందరి చేతులలో నలిగి మరీ మెతక దయింది తను. తనకు చావు తప్ప మరో మార్గం లేదు. పిల్లలను వదులుకొనే ధైర్యం లేక విరాగిలా బ్రతుకుతూ వుంది సీత.

* * *

"అలా కెలుకుతున్నావే? మసాలా అటుకులు బాగులేవా?"

"అదికాదు శాంతీ! ఏదో రకంగా వుందే. మసాలా ఎక్కువయిందను కొంటాను. జీడిపప్పు నెయ్యి బాగా వేశావు. వదలలేను....తినలేను."

"ఫరవాలేదు. వదిలెయ్యి. బలవం తంగా తినడమెందుకు?"

"థ్యాంక్స్. వదిలినందుకు ఏమీ అనుకోవద్దు. మరివిగారికెలా పెడ్తావ్ వీటిని? మనమే తినలేకపోయాం. ఆయన మాత్రం ఎలా తింటారే? నాలుగు వక్కోడీ లయినా చేస్తే బాగుంటుందేమో."

"ఆ దిగులు నీకు అక్కరలేదు ఆయన తినేలా నేను చేస్తాగా."

"ఎలా తింటాడే బాబూ!"

"చూస్తావుగా మన తడాఖా."

అక్కా, చెల్లెలు కబుర్లలో వుంటి గానే హడావిడిగా ఆఫీసునుండి వచ్చాడు మోహన్.

"సారీ శాంతి. ఆలస్యమయింది. నా కోసం కాచుకోవద్దని ఫోన్ చేశానుగా మీరు టిఫెన్ ముగించారా లేదా?"

"మా దంతాలయింది మీరే తినాలిక"

"అయితే ఫరవాలేదు. నేను కాస్సేపు పేపరు తిరగేసి తింటాను."

"పోనీ మీరు పేపరుచూస్తూవుండండి. నేను మీకు నోట్లో పెడుతుంటాను."

"అంతకంటేనా?"

"చూస్తూండ"మని కళ్ళతోనే అక్కకు సైగ చేసింది శాంతి. ఆ మాట, ఈ మాట చెబుతూ రెండుప్లేట్ల అటుకులు ఖాళీ చేయించింది భర్తతో. తినడం అయిన తర్వాత,అక్కా,చెల్లెలు పక్కున నవ్వడం చూసి ఆశ్చర్యపోయాడు మోహన్."

"అటుకు లెలా వున్నాయండి మరది గారూ?"

"బాగానే వున్నాయ్. ఎందుకలా అడుగుతున్నారు?"

"మరేం లేదండీ, మేము అరప్లేటు కూడ ఖాళీచేయలేకపోయాం మీరు రెండు ప్లేట్ల అటుకులు ఐదునిమిషాల్లో ఖాళీచేస్తే నవ్వు ఆగిందికాదు."

శాంతిని చూశాడు మోహన్. కొంటె నవ్వుతో కనిపించింది.

"అందుకేనా ఎప్పుడడిగినా నోట్లో పెట్టండి! ఇవాళ అడగనిదే టిఫెన్ పెట్టి చూపి కొట్టింది." ఏమోనండి వదిన గారూ! శాంతి తనచేతితో విషం ఇచ్చినా నాకు అమృతంలా గుంటుంది."

"ఛ....ఏవేం మాటలండీ."

"నన్ను చెప్పనియ్ శాంతి. అందుకే వదిన నే నెప్పుడూ అన్నంకూడ కలిపి నోట్లో పెట్టమంటాను. కాని మీ చెల్లి వుంది చూశారూ, భలే గడుసు—పిల్లి యున్నారనీ, పనివా రున్నారని తప్పించు కొంటుంది. కానీ, ఇదిగో....ఇలా ఏదైనా కూర. టిఫెన్ కుదరనప్పుడు తీయని మాటలతో ఖాళీ చేయిస్తుంది. నేనో మొది ట్పాయిని, నోట్లో పెట్టుంది - అదే పద్ధ తేలని అన్నీ మరచిపోయి ఆలోచన లేకుండా తినేస్తుంటాను!"

"మా శాంతి చాలా అదృష్టవంతు రాలు."

"చాలా పెద్ద లెక్చర్ ఇచ్చారు గాని. పిల్లలను అలా షికారుకు తీసికెళ్ళండి, ఇవాళ మనం రావడం కుదరదు! అక్క య్యకు మీపై చాడీలు ఎన్నోచెప్పాలి."

మోహన్‌ను, పిల్లలను బయటకుపంపి అక్కదగ్గరికి వచ్చింది శాంతి.

"ఇప్పుడు చెప్పు. ఎలా వుంది మన వ్యవహారం?"

"పోవే కొంటే. రుచిలేని అటుకులు తినిపించావ్ ఆయనతో."

"దానిలో ఏమి తప్పుందని నేనాను చెప్పు. అన్నీ బలమైన పదార్థాలేగా, ఇక రుచి మాట-ఆయనకు రుచిగ లేకపోతే, రెండు ప్లేట్ల అటుకులు ఏక బిగిని ఖాళీ చేస్తా రింటావా?"

"బానే నీవు తినిపించే తీరులోనే వుంది గొప్పదనం. నీపైంటు ఎంత ప్రేమ! ఆరాధన! అతని కళ్ళలో, వచ్చినప్పటి నుంచి చూస్తున్నాగా నీకొంగుకు ముడేసు కొన్నావ్ అతనిని. ఎంతజాణవే శాంతా?"

"నా గొప్పతనం ఏమీ లేదక్కా ఇందులో, వారు ప్రేమమూర్తులు. వారి స్వభావమే అంత. దానిని నేను జాగ్రత్తగ కాపాడుకొంటున్నాను. ఎవరినీ పల్లెత్తి మాట అనరు. అస లాయనకు కోపం అనేదితెలుసా? అనిపిస్తుంది. ఆయన కోప గించుకొని నాలుగు అంటె నా కెంతో బరువు తగ్గుతుందని పిస్తుందొక్కసారి. నే నేదైనా చేస్తా ననుకో, అందరిలా ఆయన కోపగిస్తే నా కెంతో తేలికగా వుండి ఆ తప్పు నప్పుడే మరచిపోగలను. కాని ఆయన అలా చేయరుగా? అందుకే




ఆ తప్పు పదేపదే నన్ను వెంటాడి శాంతి లేకుండా చేస్తుంది నాకు."

"ఎంత పిచ్చిదానివే నీవు!"

'నిజమేనేమో! ఓ మా రేమయిందో తెలుసా? ఆ మధ్య వారికి కొన్ని రోజులు పేకాట పిచ్చి పట్టిందిలే. ఒక ఆదివారం క్లబ్ నుంచి తొందరగా రమ్మని చెప్పినా రాలేదు. కోపంతో ఇంటికి తాళాలు వేసి, వాటిని పనివాడికిచ్చి క్లబ్‌లో ఆయన కిమ్మని చెప్పి నేను పిల్లలూ సినిమాకు వెళ్ళిపోయాం. కోపంలో అలా చేశానే గాని తర్వాత చాలా బాధపడ్డాను. ఏమి అనుకొంటారో! క్లబ్‌లోనలుగు రెదురుగా అవమానంగా ఫీల్ అవుతారేమో! ఈ మారు ఆయనకు తప్పకుండా కోపం వస్తుంది. నేను చేసిన పనికి క్షమాపణ ఎలా కోరాలో ఆలోచిస్తూ వుండిపోయి సినిమాకూడ సరిగా చూడలేకపోయాను. కాస్సేపటికి నా ప్రక్క కుర్చీలో ఏదో అలికిడైతే చూద్దునుకదా! మీ మరిదిగారు! క్షణం ఆశ్చర్యపోయాను. వారు మెల్లిగ అన్నారు కదా 'క్షమించు శాంతి! కోపం వచ్చిందా రానందుకు. ఏం చేయాలిచెప్పు. ఆట మధ్యలో ఓడిపోయి వస్తే డబ్బు పోతుందని భయపడ్డా నంటారు. గెలిచి వస్తే డబ్బు తీసుకొని వెళ్తున్నానని గేలి చేస్తారు. ఇక ఎప్పుడూ ఆ పేకాటకుపోయి నీ మనసు బాధపెట్టను. నీవు మంచిపని చేశావు సినిమాకు వచ్చి నా కోసం కాచుకొనివుంటే విసుగెత్తేది నీకు. ఆయ నలా అంటుంటే నే నెలా అయిపోయానో అప్పుడు నీ కెలా చెప్పను. అది ఇల్లు అయివుంటే క్షమించండని ఆయన పాదాలను నా కన్నీళ్ళతో అభిషేకం చేసే దానను. 'నేను ఈసినిమాకే వచ్చానని మీ కెలా తెలుసంటే. నీ అభిరుచి నా కా మాత్రం తెలియదా?' అని ఠకీమని జవా

చిచ్చారు. ఇప్పుడు చెప్పు ఆయన కెలా కోపం తెప్పించాలి.''

''ఛీ. నీ కెంత బుద్ధులు పాడు కానూ! అందరూ కోపధారి భర్తలతో వేగడం కష్టం అనుకొంటే, నీవు శాంత మూర్తిని రెచ్చగొట్టాలని చూస్తున్నావు''

''అది కాదు సీతక్కా! ఆయన ఆ వేళ నాలుగు తిట్లు ప్రసాదించి వుంటే ఆ సంఘటనను అప్పుడే మరచిపోయి వుండేదాన్ని ఇప్పుడు చూడు. పదేపదే అది నాకు జ్ఞాపకం వచ్చి నేను చేసిన సిగ్గుమాలిన పనికి బాధ పడ్తుంటాను''

పిన్నికూతురు శాంతి అదృష్టానికి మురిసి పోయింది సీత. సీతకు, తన భర్తకు, శాంతి భర్తకు ఎంత తేడా!

* * *

''అమ్మగారు ఎక్కడ్రా రంగా?''

''బయటికి వెళ్ళారండి. తమరొస్తే టిఫెను, కాఫీ ఇచ్చి నన్ను వెళ్ళమన్నా రండి. తెమ్మంటారా బాబు టిఫెన్?''

''ఇప్పుడొద్దులే! ఆ బల్లమీద వుంచి నీవు వెళ్ళు పిల్లలు కనిపించటం లేదు. ఆటల కెళ్ళారా.''

''శర్మగారింటి కెళ్ళారండి. ఇవాళ అక్కడే చదువుకొంటారట. నన్ను ఫోంచేసి వచ్చేటప్పుడు తీసుకు రమ్మన్నా రండి పిల్లలను.''

''సరే అయితే నీవు వెళ్ళు.''

పెద్దగ నిట్టూర్చాడు సత్యమూర్తి. రోజూ ఇదే పరిస్థితి అలసిపోయి ఆఫీసు నుండి వస్తే ఇంట్లో ఎవరయ్యేది ఆద రణతో తన అలసటను పోగొట్టే సతీమణి కాదు—దబుతో ఆత్మీయత కనబర్చే నౌకర్లు! గృహిణి స్వయంగా అందిచ్చే కాఫీ తాగుతూ, చక్కగ కబుర్లతో సాయంత్రాలు గడపాలని వుంటుంది తనకు కాని విజయకు—చదువుకొన్న విజయకు ఇది నచ్చదు. ''సాయంత్రం క్లబ్‌కు వెళ్ళక మగవాళ్ళకు్లాగైనా ఇంట్లో వుంటే తోచదే మీకెలా మనసవు తుంది'' అంటూ చికాకు పడుతుంది... ఒక్క రోజైనా తనొచ్చినప్పుడు ఇంట్లో వుండదు. పిల్లలు మాత్రం సాయంత్రం ఆరు గంటలకెల్లా ఇంటికొచ్చి బుద్ధిగ చదువుకొంటారు. తనకదే తృప్తి.. తల్లిగ విజయ తన బాధ్యతను విస్మ రించినా పిల్లలు మాత్రం బుద్ధిగ చదువు కొని పైకొస్తున్నారు.

అయినా విజయది అంత తప్పు ఏమిటి? తనెంత నచ్చచెప్పినా, బతి మాలినా, కోపగించుకొన్నా అర్ధం చేసు కోదే! పెరిగిన వాతావరణ ప్రభావం అది. ఒక్కతే కూతురని మరీ గారాబం చేసి పాడు చేశారు. అనవసరమైన స్వేచ్ఛ. స్వాతంత్ర్యం. ఆత్మ గౌరవం. అభి మానం. వ్యక్తిత్వం అంటూ కూచొం టుంది. పనివాళ్ళ ఎదురుగ తను కోప గించుకోరాదట. తను బాధ్యతతో అన్నీ చక్క దిద్దుకొంటే అనాలసిన అవసరం తనకెందుకు కలుగుతుంది? మరీ పిచ్చికాకత పోతే తను విజయను 'నీవు' అని మన్నిస్తేగాని ఆమె తనను 'మీరు' అన దట! ఇదెక్కడి సమానత్వం!

ఓరోజు కోపమొచ్చి తను 'నోర్ముయ్‌' అన్నాడు. కాని విజయ 'దగ్గరికొస్తే మూస్తాను' అని అంటుందా? ఎంత

పోగరు! తనకు బాగా కోపమొచ్చి చెంప చెళ్ళుమనిపించాడు. అంతే! పిల్లలను తీసుకొని పుట్టింటికెళ్ళి పోయింది.

అసలు ఆ వేళ జరిగిన సంగతి ఏమిటంటే. తను ఆఫీసుకు అర్జెంటుగ వెళ్ళవలసి వచ్చింది త్వరగా డ్రెస్ అవాలని చూస్తే, ఒక్క పాంటూ సక్రమంగా లేదు. గుండీలు పోవటమో, కాజాలు సరిగ లేకపోవటమో, ఇస్త్రీ లేకపోవటమో జరిగింది. అందుకే కోపమొచ్చి "ఇంటో వుండి ఆ మాత్రం చూసుకోలేవా? ప్రొద్దస్తమానం స్నేహితులు, షికార్లు, సినిమాలు, పట్టుబంతలూ అంటూ వెళ్ళేదాని కన్నా ఇంట్లో వుండినాకు, పిల్లలకు సదుపాయాలు చూడలేవా?" అని అన్నమాట నిజమే!.... ఇందులో కాసిమాట ఏముంది? గృహిణిగ విజయకు ఆ మాత్రం బాధ్యత లేదా? కాని ఆమెకు కోపం వచ్చింది. "మీ గుడ్డల విషయం మీరు చూసుకోలేరా? రోజూ సాయంత్రం మీరు ఇంట్లో వుండి చేసేదేముంది? పనికిమాలిన ఆ పేపర్ చూడడమేగా" అని విసురుగ అంది. తప్పు చేసింది చాలక పైగా దబాయింపు కూడానా! అందుకే కోపంతో తను 'నోర్మూయ్' అన్నాడు. ఈ కాసింత దానికి పుట్టింటికెళ్ళి పోవడమే!

తర్వాత తను బాగా ఆలోచించి ఇద్దరి మధ్య సున్నితమైన పిల్లల మనసు, చదువు, భవిష్యత్ పాడవటం ఇష్టం లేక విజయతో రాజీపడి ఇంటికి తీసుకొచ్చాడు. తన బలహీనత తెలుసుకొని ఇంకా పెట్రేగి పోతోంది.

అన్నగారి అసరా వుంది కదా అని తనను చులకన చేస్తోంది. అక్కడికెళ్ళి పాపం—ఆ అమ్మాయి-సీతపై పెత్తనం చలాయించడమేగా చేస్త. స్వేచ్ఛ, స్వాతంత్ర్యం అని అరచి గీపెట్టే విజయ సీతకు ఆ ఇంట్లో భర్తవల్ల లభించే గౌరవం, ఆప్యాయత ఏపాటివో తెలుసు. కాని, అన్నను మార్చటానికి ప్రయత్నం చదు సరికదా, అతనితోపాటు తను కూడ వదిన మీద పెత్తనం చలాయిస్తుంది... సీత ఎంతో సహనంగల అమ్మాయి. అందులో నూరోవంతు సహనం విజయలో వున్నా తనింత బాధ పడేవాడు కాదు. సీతకు, విజయకు, స్వభావాలలో ఎంత తేడా!

---

ఒక పిచ్చాసుపత్రిలో పిచ్చి వాళ్ళందరు సమావేశమైనారు. అందులో నుండి లేచి "మహాజనులారా! నేను రామాయణం చెబుతాను. వినండి!" అంటూ ఇవిధంగా చెప్పసాగాడు. సీతాదేవిని కుంభకర్ణుడు ఎత్తుకు పోయిన తరువాత శ్రీరాముడు సీత జాడకై అరణ్యములు గాలించుచుండగా నారదుడు కనిపించాడు. నారదా, సీత జాడ తెలుసుకొని రమ్మనగా నారదుడూ గాలించాడు. ఆఖరున సీతాదేవి అయోధ్యలో కనిపించగా ఆమె ఉంగరము నారదుడు తీసుకొని వెళ్ళి నరసింహస్వామికి ఇచ్చాడు. అప్పుడు నరసింహస్వామి విగ్రహము, పరుసరాముని పిలిచి రావణాసురున్ని సంహరించి రమ్మనగా పరుసరాముడు వెళ్ళి రావణాసురున్ని సంహరించాడు. ఆ తరువాత అందరూ క్షేమముగా వున్నారు. ఈ విధంగా రామాయణం ముగిసించె

—యం. శంకర్ రెడ్డి, బెల్లంపల్లి



# ఫాస్ఫోమిన్‌తో శక్తిని పొందండి

వర్షాకాలములో ఆనందముగా ఉండండి. వానలో లేక కుండపోతగా వర్షము కురుస్తున్నా బాధే అనిపించదు. మీరు ఫాస్ఫోమిన్ త్రాగుతే ఎంతో ఆనందముగా ఉంటుంది. ఫాస్ఫోమిన్ శక్తిని పుంపొందించును, అలసట నిరుత్సాహములను పోగొట్టును, ఆకలిని అధికము చేయును, శరీరము యొక్క రోగనిరోధక శక్తిని ఎక్కువ చేయును.

ఫాస్ఫోమిన్‌ను కొనండి. అది బి కాంప్లెక్స్ విటమిన్లు మరియు మల్టిపుల్ గ్లిసరోఫాస్ఫేట్లు గల ఆకుపచ్చని పండ్ల రుచిగల టానిక్కు. మీ కుటుంబమునకు ఫాస్ఫోమిన్‌ను రోజూ ఇవ్వండి. అది అన్ని కాలములలోను వాడదగిన విటమిన్ టానిక్కు.






కుటుంబము అంతటికి ఫాస్ఫోమిన్ వల్ల ఆరోగ్యము కలుగును

SQUIBB ® Sarabhai Chemicals

® ఇ.ఆర్. స్క్విబ్ & సన్స్ ఇన్‌కార్పొరేటెడ్ వారి రెజిస్టర్డ్ ట్రేడ్ మార్కుకు చిహ్నం. దాని లైసెన్సుడు ఉపయోగదారులు కరంచంద్ ప్రేమ్‌చంద్ ప్రైవేట్ లిమిటెడ్

Shilpi /HPMA 14A/71 Tel






# కథానాయకుడు హేమాంబరధరరావు అదృష్ట జాతకుడే!

మనిషికి మంచి మనసుండటమే గొప్ప అదృష్టం—అంటారు విజ్ఞులు

ఎల్లప్పుడూ మెల్లగా, ఆత్మీయంగా మాట్లాడే యువదర్శకులు శ్రీ హేమాంబరధరరావు విషయంలో యీ మాట అక్షరాలా నిజం। గత పది సంవత్సరాల కాలంలో శ్రీ హేమాంబరధరరావు రకరకాల చిత్రాలు తీశారు. ఆయన చిత్రాలు రకరకాల మార్పులు చెందుతూ వచ్చాయి కాలాన్ని బట్టి. మొదట్లో కొద్దిగా దెబ్బ తిన్నా, రానురాను ఆయన తీసిన చిత్రాలన్నీ బాక్సాఫీస్ రికార్డులను సృష్టించాయి. ఇలాంటి మార్పులకు, అప్పుడప్పుడు కొన్ని ఒడిదుడుకులకు ఆయన 'కెరీర్' గురి అయినా, ఎలాంటి మార్పులకు, చలనానికీ గురి కానిది ఆయన మనస్సు మాత్రమే।

ఆయన తన చిత్రం దెబ్బ తిన్న ఆ రోజున ఎంత మౌనంగాను, ఎంత ప్రశాంతంగాను కనుపించే వారో, యీ రోజున యింతటి ప్రముఖమైన బాక్సాఫీస్ దర్శకులయి కూడా అంతే మౌనంగా. అంతే వినయంగా కనుపిస్తారు. ఇంకా వివరంగా చెప్పాలంటే, అదృష్టం కలిసి వచ్చి సిరి వరించాక ఆయనలోని వినయ సంపద పెరిగిందేమోగాని, అహం మాత్రం రవ్వంతయినా పెరగలేదు. అది చాలా అరుదయిన లక్షణమేమో।

* * *

హేమాంబరధరరావుగారి మాట చెప్పగానే నాలాంటి అభిమానికి ప్రప్రథమంగా 'ఆడపడుచు' చిత్రం గుర్తుకొస్తుంది. ఆ చిత్రంలో అందరూ అభినందించవలసిన లక్షణాలు చాలా వున్నాయి. మంచి చిత్రాలు బాక్సాఫీస్ దగ్గర ఓడిపోతున్న యీ రోజుల్లో, చౌకబారు స్టంట్ చిత్రాలు విజయఢంకా మ్రోగిస్తున్న యీ తరుణంలో 'ఆడపడుచు' లాంటి చిత్రం అంత ఘన విజయం సాధించిందంటే దానికి ప్రబలమైన కారణం ఏదో వుండి వుండాలి. అంటే, సామాన్యుణ్ణి సైతం



విశ్వభారతి ప్రొడక్షన్స్ "శ్రీమంతుడు" చిత్రంలో
నాగేశ్వరరావు, సుందరాంగులు.

## ప్రేమనగర్

తన హృదయాన్ని దోచుకొన్న ప్రియురాలు - మరొకనితో వివాహమై తనకు దూరమై పోనున్నదన్న బాధతో అల్లల్లాడి పోయాడు ఆ అందమైన యువకుడు. తన ప్రియురాలి కోసం ఎంతో శృంగారంగా నిర్మించుకొన్న ప్రేమనగర్ మందిరంలోకి మతిపోయినవాడిలా హృదయావేదనతో ముద్దగా తడిసి ప్రవేశించాడు. అతడి దుఃఖావేదనకు తోడుగా ప్రకృతి భీభత్సంగా విజృంభించింది. తుఫాన్ చెలరేగింది. ఉరుములు మెరుపులతో వర్షం ప్రళయంగా వీచింది. అంతకన్నా భీకరంగా ఆ భగ్నహృదయుడి ఎదలో అగ్నిపర్వతం ప్రజ్వరిల్లింది—

"ఎవరి కోసం-ఎవరి కోసం:
ఈ ప్రేమ మందిరం—
ఈ శూన్య నందనం
ఈ భగ్న హృదయం -
ఈ అగ్ని గుండం
ఎవరి కోసం-ఎవరి కోసం -
ఎవరి కోసం....''

అంటూ అతడి కంఠం నుంచి జ్వాలలా గీతం జ్వలించింది. విరక్తి చెందిన మనసుతో విషాన్ని త్రాగి పిచ్చిగా వాపోయాడు. మానసిక బాధతో కృంగిపోయాడు.



అనూరాధ ఆర్ట్సు పిక్చర్స్ "అనూరాధ"లో రాజశ్రీ, కృష్ణంరాజు

హృదయాన్ని కదిలించే ఈ సన్నివేశం రంగుల్లో రూపొందుతోన్న "ప్రేమ నగర్" చిత్రం లోనిది.

సురేష్ మూవీస్ పతాకం క్రింద ప్రజా రంజకంగా ముస్తాబవుతోన్న ఈ "ప్రేమ నగర్" చిత్రంలోని 9 పాటలు, 2 గేయాలు వీనులకు కమ్మని విందు కాగలవు. సాధ్యమైనంత త్వరలో ఈ పసందైన చిత్రాన్ని అఖిలాంధ్ర ప్రజలకు అందజేయాలనే నిర్మాత శ్రీ డి. రామానాయుడిగారి సంకల్పం. దర్శకత్వం: కె. యస్. ప్రకాశరావు; కథ: కోడూరికౌసల్యాదేవి; మాటలు-పాటలు: ఆత్రేయ; కెమెరా: ఎస్. వెంకటరత్నం; సంగీతం: కె. వి. మహదేవన్; కూర్పు: మార్తాండ్; సహ కార దర్శకుడు: బి. సుబ్బారావు.

తారాగణం: అక్కినేని నాగేశ్వరరావు, గుమ్మడి, సత్యనారాయణ, రాజబాబు, కె. వి. చలం, ధూళిపాళ, రావి కొండల రావు; వాణిశ్రీ, శాంతకుమారి, ఎస్. వరలక్ష్మి, మీనాకుమారి, అనిత, రమాప్రభ, పుష్పకుమారి, లక్ష్మీఛాయ (బొంబాయి), జ్యోతిలక్ష్మి, జయకుమారి, బేబి బ్రహ్మాజీ మున్నగువారు నటిస్తోన్న ఈ చిత్రంలో గెస్టు ఆర్టిస్టులుగా ఎస్. వి. రంగారావు, పద్మశ్రీ వి. నాగయ్య పాల్గొన్నారు. ప్రెస్ రిలేషన్స్: శ్రీకృష్ణ. నవయుగ విడుదల.



శ్రీ విఠల్ ప్రొడక్షన్సు అండ్ కో వారి "సి. ఐ. డి. రాజు"లో విజయలలిత ముష్టి ఘాతవిన్యాసం.

ఇప్పటికి 17 సం॥ములుగా అఖిలాంధ్ర పాఠకలోకాన్ని మెప్పిస్తున్న—

## గోటేటి ఫిలిం డైరీ

## 1971-72

ఇప్పుడే వెలువడింది: విడి ప్రతి రు 3-00 పోస్టేజి రు 1-25 లు ఏజెంట్లుగాని, పాఠకులుగాని M. O. ద్వారానే ఆర్డరు పంపాలి. V. P. P. పద్ధతి లేదు.

ప్రతులకు: గోటేటి బుక్సు, సి-290, అశోక్ నగర్, మద్రాసు-33.

చెల్లెలి కాపురం

అన్నా చెల్లెలి అనురాగాన్ని యితివృత్తంగా తీసుకొని అమృతా ఫిలింస్‌వారు అత్యద్భుతంగా నిర్మిస్తున్న "చెల్లెలి కాపురం" చిత్రం పూర్తి కావచ్చింది. నటుడు శ్రీ ఎం. బాలయ్య సమర్పించు ఈ చిత్రంలో—శోభన్‌బాబు, వాణిశ్రీ, నాగభూషణం, మణిమాల, అల్లు రామలింగయ్య, కె. వి. చలం, సంధ్యారాణి, ఛాయాదేవి, మీనాకుమారి ప్రభృతులు నటిస్తున్నారు. కథ: ఎం. బాలయ్య;

సి. ఐ. డి. రాజు

ప్రారంభంనుంచీ సస్పెన్సూ, వడి వడిగా పరుగులెత్తే కథాగమనం, క్రయి

మెలో ఒక కొత్త రయముగల చిత్రంగా శ్రీ విరల్ ప్రొడక్షన్స్ అండ్ కో వారి సి. బి. డి. రాజు వస్తున్నాడు. శ్రీ బి. విరలాచార్య సమర్పణగా శ్రీ బి. వి. శ్రీనివాస్ నిర్మించిన ఈ కొత్త తరహా క్రయిమ్ చిత్రాన్ని శ్రీ కె ఎస్. ఆర్ దాసు డైరెక్టుచేశారు

37 నెంబరు ఖైదీ రంగన్న ఖైదీ దుస్తులతోనే పారిపోయినట్టు - పోలీసు రేడియో పదేపదే ప్రకటించింది. అతని ఆనవాళ్ళన్నిటిపై పూసగ్రుచ్చినట్లు ప్రకటనలో తెలియపరిచింది. అతడు ఎవరికీ ఎక్కడా కనబడలేదు. గ్రామపెద్ద ధర్మయ్యగారింట్లో ప్రవేశించాడు. అప్పటికే రంగన్న వేషం తరహా మారిపోయింది చిత్రంచూస్తేనే కాని ఆ మార్పు మీకు అర్థంకాదు. ధర్మయ్యగారి ఆత్మీయతనూ, ఆతిథ్యాన్నీ పొందిన రంగన్నలో అనేక ఆలోచనలు, మార్పులూ వచ్చాయి. ఎవరికీ అంతుబట్టని కథ ఊహకందని సన్నివేశాలూ ఉత్కంఠను గూర్చే క్లయిమాక్సు — మీకు చిత్రం చూస్తేనే అర్థమవుతుంది.

ఈ వినూత్న విశిష్ట క్రయిమ్‌చిత్రానికి శ్రీ బి విరలాచార్య కథ, శ్రీ పింగళి రావ్ మాటలు, శ్రీ సి. నారాయణరెడ్డి

ఇప్పటికి మూడు పాటలు, ఏడు పద్యాలు రికార్డింగయ్యాయి.

రెండవ షెడ్యూలు జూలై 23 నుంచి ఆగస్టు 2 వరకు జరిగింది.

మనుష్యులను హత్తుకుపోయే మనోహర దృశ్యకావ్యంగా చిత్రీకరింపబడుతున్న ఈ చిత్రంలో - నట సమ్రాట్ ఎస్. వి. రంగారావు, శోభన్ బాబు, చంద్రకళ ముఖ్య భూమికలను పోషిస్తున్నారు.

ఇంకా—గుమ్మడి, ధూళిపాళ, సత్యనారాయణ, ఎస్. వరలక్ష్మి, కృష్ణకుమారి, హేమలత, ప్రభావతి, టి. నిర్మల, చంద్రమోహన్, నాగరాజు, వల్లం నరసింహారావు, అర్జా జనార్ధనరావు, మిక్కిలినేని, పి. రామకృష్ణ, తంబి, జగ్గారావు, ఆనంద మోహన్, కాశీనాథ్ తాతా, అశోక్ కుమార్, జి. ఎన్. స్వామి, జూనియర్ కాంచన, పద్మిని మొదలగువారు సహ తారాగణం.

రచన : ఆరుద్ర, ముళ్ళపూడి వెంకట రమణ; పాటలు, పద్యాలు : సి. నారాయణ రెడ్డి, ఆరుద్ర, దాశరథి, కొసరాజు, గబ్బిట వెంకట్రావు, సంగీతం : కె. వి. మహదేవన్, ఫొటోగ్రఫీ : కె. ఎస్. ప్రసాద్, నృత్యాలు : పసుమర్తి కృష్ణమూర్తి, కళ : ఎ. కె. శేఖర్, కూర్పు : ఎ. సంజీవి, రూపాలంకరణ : వాలి, వస్త్రాలంకరణ : నారాయణమూర్తి, మేకప్ : రమేష్ నాయుడు, అసోసియేట్



మాలినీ ఆర్టు ఫిలిమ్స్ 'ప్రియ' ప్రారంభోత్సవంలో సాంకేతిక నిపుణులను పుష్పమాలాంకృతుల్ని చేస్తున్న నిర్మాత మాలిని.

---

డైరెక్టర్స్ : కె. వి. రావు, వి. ఎస్. బోస్, దర్శకులు : బాపు, నిర్మాత : నిడమర్తి పద్మాక్షి, విడుదల : లక్ష్మి ఫిలింస్.

### కూతురు-కోడలు

పూర్ణా ఆర్ట్ పిక్చర్స్ బేనర్‌లో నిర్మాతలు శ్రీయుతులు పూర్ణచంద్రరావు, చంద్రశేఖర్‌గారలు నిర్మిస్తున్న 'కూతురు కోడలు' చిత్రం ఈ నెలలో విశాలాంధ్ర అంతటా విజయవంతంగా విడుదల కానున్నది.

శ్రీ లక్ష్మీదీపక్ దర్శకత్వం వహిస్తున్న ఈ చిత్రంలో శోభన్‌బాబు, విజయలలిత, రామ్మోహన్, గీతాంజలి, హేమ



కేశినేని మూవీస్ "బంగారు కుటుంబం"లో గుమ్మడితో బాలతారలు

లత, ప్రభాకరరెడ్డి, విజయశ్రీ, అల్లు రామలింగయ్య, కె. వి. చలం, సంధ్యారాణి ప్రభృతులు నటీనటులు.

శ్రీ ఫిలింస్ విజయవాడ.

## రామాలయం

"జరిగిన కథ", "తల్లి తండ్రులు" వంటి చిత్రాలు పటిష్టమైన కథతో విశిష్టంగా చిత్రించి అఖిలాంధ్ర ప్రేక్షకుల ఆదరాభిమానాలు చూరగొని ఉత్తమ దర్శకుడని పేరుపొందిన దర్శకుడు కె. బాబూరావు రామవిజేతా ఫిలింస్ బానర్‌లో "రామాలయం" అనే కొత్త చిత్రాన్ని యీ మధ్య భరణిలో ఉన్నత కుటుంబానికి చెందిన ఓ యింటి సెట్టులో నిర్విరామంగా వారంరోజుల పాటు షూటింగ్ జరిపించారు. ఇందులో ఒకపాట చంద్రమోహన్ కుమారి రోజా రమణిలపై చిత్రీకరణ జరిగింది. ఇంటి యజమానురాలుగా సూర్యకాంతం ఆమె కుమారుడుగా చంద్రమోహన్. కోడలుగా రోజారమణి నటించారు.

ఇంకా జగ్గయ్య, అల్లురామలింగయ్య, రమణారెడ్డికూడా పాల్గొన్నారు.

వీరితోపాటు శ్రీమతి జమున, శోభన్ బాబు, విజయనిర్మల, ప్రభాకర రెడ్డి, రాజబాబు, కనకం నటిస్తున్నారు.

ఇది పూర్తిగా కొత్త తరహా కథ. గ్రామీణ వాతావరణంతో యిద్దరన్నదమ్ముల మధ్య ప్రేమానురాగాలు. అభిమానాలతో పెనవేసుకపోయే విధంగా



"బంగారు తల్లి"లో కృష్ణంరాజు, జమున.

---

కొంగ్రొత్త పద్ధతిలో చిత్రీకరిస్తున్నామని నిర్మాత కె. ఎ ప్రభాకర్ చెప్పారు.

సినిమా రూపకల్పన. దర్శకత్వం: కె. బాబూరావు, మాటలు: పినిశెట్టి; సంగీతం: ఘంటసాల, సాహిత్యం: కొసరాజు; సి. నా. రె; దాశరథి, కెమెరా: మాధవ బుల్‌బులె, నిర్మాత: కె. ఏ. ప్రభాకర్.

# 'ఆరాధన' రాజేష్ ఖన్నాతో ఇంటర్వ్యూ!

'ఆరాధన' హీరో రాజేష్‌ఖన్నా పేరు చెప్పగానే కుర్రాళ్ళు, కుర్రమ్మాయిలు ఒక్కసారి ఎగిరి గంతేస్తున్న రోజులివి. ఈ మధ్యకాలంలో యింతిగా మరే యితర హీరో కుర్రకారు హృదయాన్ని దోచుకోలేదేమో.

ఎప్పుడూ ఏదో కొత్తదనం యివ్వాలని ఆశిస్తున్న 'జ్యోతి' యీ సంచిక కోసం ప్రత్యేకంగా ఈ యింటర్వ్యూ చేయించటం జరిగింది. జరిగిన గోష్ఠిని యధాతధంగా ప్రచురిస్తున్నాం—సం॥

ప్రశ్న మీరు యింత పెద్ద స్టార్ కాకుండా వున్నట్లయితే ఏంచేస్తుండేవారు?

జవాబు చిన్నస్టార్‌గా వుండేవాణ్ణేమో।

ప్ర అసలు 'స్టార్' కాకుండా వున్నట్లయితే?

జ. నాకు తోచిన పనేదో దొరికేది।

ప్ర మీ అసలు పేరేమిటి?

జ జతన్ ఖన్నా.

ప్ర మీరు మీ సినిమాలు చూస్తారా?

జ చాలా ఎక్కువ— చూస్తాను కాని రాజేష్ ఖన్నాగా చూడను జతన్ ఖన్నాగా చూస్తాను.

ప్ర. మీ సినిమాలు చూస్తుంటే మీకేం అనిపిస్తుంది?

జ: అందరిలాగే నేనూ।

ప్ర. మీ జీవితంలో ఆనందం ఎప్పుడు పొందుతుంటారు?

జ: ప్రేక్షకులకు నేను నటించిన సినిమా చూడటానికి వచ్చి, టిక్కెట్లు దొరక్క వెళ్ళిపోతున్నప్పుడు

ప్ర ఎప్పుడైనా కన్నీరు కార్చారా?

జ నా స్నేహితులకు కష్టాలొస్తే, నాకు కన్నీరు వస్తుంది

ప్ర. మీ రీ మధ్య చిక్కినట్లున్నారు?

జ అవును ఆహారం తగ్గించాను. నేను బలిస్తే నానిర్మాతలు చిక్కిపోతారు

ప్ర మీరు భోజనప్రియులా?

జ నాకు బెంగాలీ భోజనం అంటే చాలా యిష్టం.

ప్ర ఇంకా ।

జ స్వీట్లన్నా చాలా యిష్టం

ప్ర. మీ జుట్టు అలా చిందర వందరగా వదిలేస్తారేం?

జ: అది నా మాట వినదు.

ప్ర స్ప్రే చల్లుకోవచ్చుగా?

జ : ఆడపిల్లలు అలా చేస్తారు. నేను ఆడపిల్లను కానుగా!

ప్ర : మీరు, అంజు మహేంద్ర అనే ఫోటోతార ప్రేమాయణంలో.........!

జ : నేను అందరినీ ప్రేమిస్తాను. మిమ్మల్నీ ప్రేమిస్తాను.

ప్ర : పోదురూ మరీ వేళాకోళం. అంజు మహేంద్ర ప్రేమ చాలా మాసైన ప్రేమటగా!

జ : "................"

ప్ర : పెళ్ళెప్పుడు?

జ : అసలు చేసుకోను.

ప్ర : ఏం గయ్యాళిభార్య వస్తుందని భయమా?

జ : కాదు. భార్యా బిడ్డల్ని గమనించే వ్యవధి నాకు లేదు.

ప్ర : మీరు ఎక్కువగా ఏ తారతో చేస్తారు?

జ : లలితా పవర్ అనే "తల్లి వేషాల" తారతో!

ప్ర : మీరు ఖాళీగా ఉంటే ఏంచేస్తారు?

జ : లిటరేచర్ చదువుతాను.

ప్ర : మీకు ఆడపిల్లలంటే యిష్టమా?

జ : లేదు, పసిపిల్లలంటే యిష్టం.

ప్ర : కొందరు తారలకు కుక్క పిల్లలు, పిల్లి పిల్లలు, ఎలికపిల్లలో ఇష్టం గదా..........?

జ : ఒకళ్ళసంగతి నాకు తెలీదు.

ప్ర : మీ మనస్సు ఏం చెపుతుంది మీకు?

జ : నలుగురితోనూ ఆత్మీయంగా వుండమని.

ప్ర : అంటే అలా నటించమనా?

జ : నాది నటనో, నిజమైన ప్రేమో నేను చెప్పను. నామిత్రులనే అడగాలి.

ప్ర : ఇలా మదరాసు వస్తే ఎక్కువగా ఏ తారతో మాట్లాడుతారు?

జ : ఒకరని లేదు. నన్ను పలకరించిన వారందరితోనూ మాట్లాడుతాను.

ప్ర : ఇక్కడ మీకు బాగా ఫ్రెండ్ ఎవరు?

జ : మెరినా బీచ్!

ప్ర : తెలుగుపిక్చర్లేవయినా చూశారా

జ : సారీ, అంత ఎక్కువగా చూడలేదు. మచ్చుకు ఒకటి రెండు చూశాను.

ప్ర : హిందీలో మీరేట "పసలాయిల్లోడు"?

జ : అవును.

ప్ర : ఆ పిక్చర్ చూశారా?

జ : చూశాను. ఫైన్ ఫిల్మ్!

ప్ర : తెలుగు పిక్చర్లో యాక్టు చేస్తారా?

జ : భాష రాదుగా?

ప్ర : డబ్బింగ్ చేయొచ్చుగా!

జ : అయినా లాభంలేదు. ఆ ఎమోషన్స్ రావు.

ప్ర : క్షమించాలి. చాలా యిరుకు ప్రశ్నలు వేసినందుకు.

జ : లేదు మీరే క్షమించాలి-కొంటెగా జవాబులు చెప్పినందుకు!

